# ప్రజాసాహితి

సాహిత్య సాంస్కృతికోద్యమ మాసపత్రిక

సంపుటి : 19 సంచిక : 12

177 జూలై 1996



రచనలు పంపవలసిన చిరునామా :

**నిర్మలానంద,**

వర్కింగ్ ఎడిటర్, ప్రజాసాహితి,

7-1-23, తమిళ్ స్ట్రీట్,

చినవాల్తేరు,

విశాఖపట్నం - 530 023.

ప్రజాసాహితి కార్యాలయం,

29-28-67, దాసరివారి వీధి,

సూర్యారావుపేట,

విజయవాడ - 520 002.

ఏజంట్లు, చందాదారులు

వ్రాయవలసిన అడ్రస్,

ఇతర వివరాలకు :

**కొత్తపల్లి రవిబాబు,**

ప్రధాన కార్యదర్శి, జనసాహితి,

నగరం-522 268.

గుంటూరు జిల్లా





ముఖచిత్రం :

అల్లూరి సీతారామరాజు

బాపి


| | |
|---|---|
| సంచిక వెల : | రు. 7-00 |
| సం॥ చందా వ్యక్తులకు | రు. 50-00 |
| సంస్థలకు | రు. 100-00 |

చందాలు చెక్కుల రూపంలో

పంపేటప్పుడు కలెక్షను కోసం

అదనంగా రూ.7/- కలిపి పంపించండి

# ఈ సంచికలో ...


- సంపాదకీయం 3
- స్పందన : 1. నేరస్తులకు శిక్ష విధిస్తారా 5
  2. సి.బి.సి.ఐ.డి.ల నేర పరిశోధన - ప్రభుత్వం 6
- పిచ్చివాడు (కథ) - తమ్మినేని లక్ష్మీరాజు 8
- సారా పోరాటం వర్ధిల్లాలి - నిశితాసి 12
- పుస్తక సమీక్ష :
  యోధుడా అంటూ కౌగిలించుకున్న కవిత్వం 17
  ఒక చావుతో అంతం కానివాడిని 23
- సజీవ సాహిత్యం : కో.కోతో పద్మరాజు ఇంటర్వ్యూ 26
- చెదిరిన సమాజం (ఆఫ్రికన్ నవల సీరియల్)
  మూలం : చినువా అచ్‌బే, అనువాదం : కొలసాని సాంబశివరావు 33
- పిల్లల ప్రపంచం :
  అల్లూరి సీతారామరాజు బాల్యం - కంతెవరపు వెంకట్రామయ్య 39
  37
- కవితలు :
  తెలంగాణా పల్లె - శోధన్ 7
  ఎక్కడో పడిపోయింది తాళంచెవి - నిఖిలేశ్వర్ 15
  ఆరగాన్ నుంచి ఒక ఉత్తరం - జాన్ కార్న్‌ఫర్డ్ 16
  దేశం కోసం - సుధేరా 20
- సంతాపం :
  అయ్యపు వెంకట్రామయ్య 21
  కామ్రేడ్ కుమారి 52
- సంస్మరణ సభ : మార్పు పద్మనాభం శతజయంతి 47
- చైతన్యవాహిని 50
- ఉత్తరాలు 53
- స్వీకారం 56



Edited, Printed and Published by K. RAVI BABU on behalf of
JANA SAHITI (A.P.) at Chaitantya Printers, Vijayawada - 2.
for Co-operative Press, Vijayawada.
Working Editor : NIRMALANANDA

# నిజానికీ అబద్ధానికీ మధ్య

సుమారు 25సం॥ల క్రితం 'విజయ చిత్ర' అనే సినిమా పత్రికవారు సినిమాలలో ముద్దులు ఉండొచ్చా, కూడదా? అని చర్చ నిర్వహిస్తే కొడవటిగంటి కుటుంబరావు గారు.."పాఠకుల్ని లేక ప్రేక్షకుల్ని ముద్దులు చూడటానికి మానసికంగా సంసిద్ధుల్ని చేయటానికే ఈ చర్చ" అని ప్రకటించారు. సరిగ్గా చంద్రబాబునాయుడి ప్రభుత్వం విడుదల చేసిన శ్వేతపత్రం' ఆర్థిక పరిస్థితిని మెరుగుపరచటానికి ప్రజలు మేధావుల సూచనలివ్వండి అనే విజ్ఞప్తులూ ప్రజలపై మరింతగా మోపబోయే భారానికి, మద్య నిషేధాన్ని రద్దు చేయటానికీ ప్రజల్ని సంసిద్ధులు చేయటానికి ఉద్దేశించినదే! ఇది ప్రజలనుండి తక్కువ నిరసన పొందటానికి విసిరిన పాచిక మాత్రమే.

"ఇంటికొక పోలీసుని నియమిస్తే తప్ప మద్యనిషేధాన్ని సక్రమంగా అమలుపరచలేమని' ' ఎక్సైజుశాఖ మంత్రి ప్రకటనా, మద్యనిషేధం విఫలమయింది కనుక నిషేధాన్ని రద్దు చేయటమే మేలనే వాదన పెద్ద ఎత్తున సాగించించారు. కిలో 2రూ. బియ్యం పథకం, వ్యవసాయ విద్యుత్తుకి సబ్సిడీ, మద్యనిషేధం అనే విపరీత ప్రచారంతోనే టి.డి.పి. చీలకముందు జరిగిన అసెంబ్లీ ఎన్నికల లో ఘనవిజయం సాధించారు. ఇటీవలి పార్లమెంటు ఎన్నికలలో కూడా ముందు వెనకా చూసుకోకుండా పై వాగ్దానాలను తిరిగి ఏకరువు పెట్టారు. ఏరుదాటాక తెప్ప తగలేసిన చందంగా పన్నుల భారాన్ని మోపటానికే, లిక్కరు లాబీని సంతృప్తి పరచటానికే బాబు ప్రభుత్వం సిద్ధపడుతోంది.

మద్య నిషేధం విఫలమైంది కనుక రద్దు చేయటం తప్పులేదంటే...ముందుగా రద్దు కావలసినది రాష్ట్రప్రభుత్వం, పోలీసు, ఎక్సైజు యంత్రాంగాలు. ఎందుకంటే వైఫల్యానికి పూర్తి బాధ్యత వారిదే కనుక. అధికార పార్టీ ఎం.ఎల్.ఎ.లూ నాయకులే దొంగ సారా హోల్‌సేల్ కాంట్రాక్టర్లుగా వున్నారు. అక్కడక్కడ పోలీసు ఎక్సైజుశాఖ వారు పట్టుకున్న వారంతా చిల్లర వ్యాపారస్తులు మాత్రమే.

ప్రభుత్వమే సారా వ్యాపారం చేయించిన రోజుల్లో కూడా సారాకాంట్రాక్టర్లే దొంగసారా తయారుచేసి సుంకం చెల్లించకుండా అమ్ముకునేవారు తమ వ్యాపారానికి పోటీగా ఎవరైనా సారా కాస్తే వారిని స్వంత గూండా బలగాలతో చితక కొట్టించేవారు. గత పదిసం॥ల కాలంలో మద్యం వ్యాపారం చేసిన వారి ఆస్తులను జప్తుచేస్తే దొరికే నల్లధనంతో బాబు ప్రభుత్వం లోటు లేకుండా వాళ్ల అసెంబ్లీ ఎన్నికల ద్వారా పరిపాలించవచ్చు. ఆసంగతి వాళ్లకు తెలియదని కాదు. అలా చేయరని చెప్పటానికే!

మద్యానికి వ్యతిరేకంగా ముఖ్యంగా గ్రామీణ మహిళలు ఉద్యమిస్తే, నగరాల్లోని 'మేధావుల'ని ఆహ్వానించి అభిప్రాయ సేకరణ జరపడం ఎంతమోసం, దగా!! ఒకవైపున మద్య నిషేధం కారణంగా క్రిమినల్ కేసులు తగ్గాయనీ, గ్రామీణ ప్రాంతాల్లో కొనుగోలు శక్తి

పెరిగిందనీ తెలుస్తోంది. నిషేధం ప్రకటించిన తొలి రోజులకంటె తాగుడు పెరుగుతోంది. ప్రజలు నిజంగా తాగుడు పూర్తిగా మానేస్తే గగ్గోలు పెట్టేది పాలకవర్గ దోపిడీ శక్తులే. వారి ఎన్నికల వికటాట్టహాసాలకి తాగుడు అవసరం. వారే నిర్వహించుకునే చట్టబద్ధ, చట్టవిరుద్ధ మద్యం వ్యాపారానికి వినియోగదారులైన తాగుబోతులు కావాలి. కనుక ప్రజల్ని తాగుడు విషవలయంలో నుండి బయటకు పోనీయకుండా చేసుకోవటం దోపిడీ, పెత్తందారీ శక్తులకు ఎంతైనా అవసరం. వారిమోచేతి నీళ్ళు తాగి అక్రమ సంపాదనకు అలవాటు పడ్డ యంత్రాగానికీ అవసరం. అందుకే 'చిత్త శుద్ధి లేని శివపూజలు' చేస్తూ నిషేధం విఫలమైనది. కనుక మద్యం లాబీవారి చట్టబద్ధ దోపిడీకి సానుకులతను కల్పించటమే బాబు ప్రభుత్వ ప్రయత్నం.

గత పది సం॥లలో రాష్ట్ర ప్రభుత్వం దివాళాతీసిందని ప్రకటించిన శ్వేతపత్రంలో అదే కాలంలో విద్య, వైద్యం, రియల్ ఎస్టేట్, గ్రానైట్, స్టార్ హోటల్ వ్యాపారస్తులూ బడా కాంట్రాక్టర్లూ, రొయ్యలూ, పండ్లతోటల భూస్వాములూ ఎన్ని వేల కోట్ల రూ. ఆస్తులు పెంచుకున్నారో దాచి పెట్టారు. మంత్రులూ, ఎం.ఎల్.ఏలు, ఎం.పీలు, అవినీతి అధికారులూ మాఫియా గ్యాంగ్స్ లీడర్లు - చివరికి పుట్టపర్తి బాబాలాంటి అనేక మంది దొంగ స్వాములూ, సినిమా నటులు, ఎంతోమంది ఈకాలంలో కోట్లకి పడగలెత్తినా తెలియనట్టే నటిస్తున్నారు విద్యుత్తు దొంగిలించే పారిశ్రామికాధిపతుల్నీ రాయలసీమ ముఠాదార్లనీ యధేచ్ఛగా వదివేశారు. సంపన్నుల ఆదాయాలపై పన్నులు లేవు. పరిమితాలూ లేవు. ఆ పది సం॥ల కాలంలో పేద,ధనిక వ్యత్యాసం అత్యంత వేగంగా కొట్టొచ్చినట్టుగా పెరిగిపోతున్నట్టు అందరికీ తెలుస్తున్నా ఈ నిజాన్ని కావాలనే తొక్కి పట్టారు.

పేద, మధ్యతరగతి ప్రజల ఓట్లు దండుకోవటానికి యిచ్చ జూపిన సబ్సిడీలను- ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (ఐ.యమ్.ఎఫ్) ఆదేశాలమేరకు అటు కేంద్ర ప్రభుత్వమూ, ఇటు రాష్ట్రప్రభుత్వమూ, ఒక్కటొక్కటే రద్దు చేయాలని సంకల్పించాయి. పెట్రోలు,డీజెలు, వంటగ్యాసు రైలు, తంతితపాలా... తదితర వినియోగ సరుకుల ధరలను కేంద్ర ప్రభుత్వం నిర్లాక్ష్యణ్యంగా పెంచితే, బియ్యమూ, విద్యుత్తూ, నీటితీరువా, స్టాపు డ్యూటీ తదితర ధరలను రాష్ట్ర ప్రభుత్వం పెంచ పూనుకుంది.

ఒకవైపున నిరుద్యోగం తెగ పెరిగిపోతుంటే, మరోవైపు ఉన్న ఉద్యోగాలలో కోత విధించాలని చూస్తున్నారు. జీతాలను కత్తిరించే కుట్రలు చేస్తున్నారు. ఒక్క మాటలో సామ్రాజ్యవాదులకు, కోటీశ్వరులకు విచ్చలవిడిగా దేశ సంపదల్నీ, శ్రమజీవుల్నీ దోచుకోవటానికి సమస్త అవకాశాలూ కల్పించటం -పేద మధ్యతరగతి, చిన్న వ్యాపార వర్గాల్నీ రైతాంగాన్నీ బుక్కాపకీర్లుగా మార్చటమే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల విధానాలుగా సాగుతున్నాయి.

మద్య నిషేధం రద్దుకూ, పెంచుతున్న నిత్యావసరవస్తువుల ధరలకూ, జీతాల కత్తిరింపుకీ, నిరుద్యోగానికీ వ్యతిరేకంగా ప్రజలు తీవ్రంగా ఉద్యమించాల్సిన పరిస్థితులు ముంగిట్లోకి వచ్చేశాయి. ప్రజాపక్షం వహించే రచయితలూ, కళాకారులు తమకలాలనీ, గళాలనీ దృఢంగా ప్రజాందోళనకు మద్దతునందించటానికి సంసిద్ధం కావాలి. ★

# ఏ నేరస్తులకి శిక్ష విధిస్తారు?

**అ**మలాపురం దగ్గర రోళ్లపాలెం గ్రామంలో 7సంవత్సరాల పసిబాలికపై 11-14 సం॥ల వయస్సుల మధ్య నున్న 4గురు బాలుర సామూహిక అత్యాచారం జరిపిన వార్త మనగుండెల్ని పిండి వెయ్యటంలేదా? గత పార్లమెంటు ఎన్నికల సందర్భంలో అవనిగడ్డ జూనియర్ కళాశాలలో మైనర్ బాలిక జ్యోతిపై 15సం॥ల బాలురు ముగ్గురు లైంగిక అత్యాచారం జరిపి హత్య చేసిన ఉదంతం వెలుగు చూడగానే మనం జీవిస్తున్నది ఆటవిక దేశంలోనా అనిపించటం లేదు?

ఇంత భయంకరమైన మృగతత్వం, పథకం ప్రకారం హత్యా కాండ జరపటం 15సం॥ల చిన్న పిల్లలలో ఎలా చోటు చేసుకుంది? పై దుష్కృత్యాలకు పూర్తి బాధ్యులు వాళ్ళేనా? ఈ మైనరు బాలల్ని న్యాయస్థానాలు ఎలా శిక్షించ బోతున్నాయి?

పిల్లల్ని సంస్కారవంతులుగా, మానవీయులుగా తీర్చిదిద్దవలసిన తల్లిదండ్రులూ, ఉపాధ్యాయులూ, విద్యావిధానం, వీరందరి చుట్టూ ఉన్న సాంస్కృతిక వాతావరణం యొక్క బాధ్యత ఏమీ లేదా? సెక్సు-వయొలెన్స్ (హింసాకాండ) తప్ప మానవీయ విలువలు ఎరగని రకరకాల రంగు రంగుల సినిమాలు, టీ.వీ.ప్రసారాలూ, బూతుపాటలు, హత్యాచారాల దృశ్యాలూ, వాల్ పోస్టర్లూ, చౌకబారు సాహిత్య ప్రభావంతోతప్ప ఆపసిబాలురు కరకు కసాయిలుగా మరే అవకాశం లేదు.

**అ**వనిగడ్డ జ్యోతిపై హత్యాచారం జరిపిన వారిలో ముఖ్యుడు బాల శ్రీనివాసు, పంచాంగం చూసి మరీ పథకం వేశాడట! పంచాంగం ప్రకారం జ్యోతికి శ్మశాన దర్శనం, తనకి స్త్రీ సంభోగ ప్రాప్తి కలదని గ్రహించాడట!! అది గంటల పంచాంగమా? బూతుల పంచాంగమా?

మహా అయితే వాడు యండమూరి వీరేంద్రనాథ్ తరహా సెక్స్-క్రైం-క్షుద్ర సాహిత్యాన్నే చదివి వుంటాడు. అటువంటి సినిమాలను బాగా చూసి వుంటాడు.

క్రూరమృగతత్వాన్ని చిన్న పిల్లలతో కూడా వ్యాప్తి చేస్తున్న నిజమైన నేరం-ఈనాటి పతన విలువల సాంస్కృతిక వాతావరణానిదే. ముఖ్యంగా సినిమా-టి.వీలదే !!

మానవ బలహీనతల్ని సొమ్ముగా మార్చుకుందామనే నీచమైన డబ్బు తత్వం జీర్ణించిన రచయితలూ, ప్రచురణకర్తలూ, సినిమా నిర్మాతలూ-దర్శకులూ, పీతిజోకుల బూతు పత్రికలూ, నటులూ, పాటల డైలాగుల రచయితలూ- టి.వీ. ప్రసార కేంద్రాలూ వారికి యథేచ్ఛగా అవకాశాలను కల్పిస్తున్న చట్టాలూ - ప్రభుత్వాలూ... వీరు కాదా నిజమైన నేరస్తులు?

నేరానికి కారకులని చేసి వ్యక్తుల్ని శిక్షిస్తారు. చిత్తకార్తె కుక్కల సంస్కృతిని పెంచి పోషిస్తారు. ఒకటో రెండో దోమల్ని చంపుతారు-మురుగుకి ఎరువులేసి వ్యాప్తి చేస్తారు. ఇదేగా నేటి పాలకుల సాంస్కృతిక విధానం. న్యాయస్థానాల తీర్పులు !!

సెక్సు-వయొలెన్సుల బూతు కోతల రోత సినిమాలకూ, వాటిని ప్రసారం చేసి సొమ్ము చేసుకుంటున్న విదేశీ స్వదేశీ టి.వీ కేంద్రాలకూ వ్యతిరేకంగా పెద్ద ఎత్తున ప్రజాందోళన ప్రబలకపోతే మళ్లీ మళ్లీ ఇవే దుర్మార్గాలను వినవలసి వస్తుంది-కనవలసి వస్తుంది.

**- నిరంజన్, తెనాలి. 4.7.96**

పై స్పందన మాకు చేరేలోగా మచిలీపట్నం సమీపంలో గల మంగినపూడి బీచ్‌లో విహారం చేయటానికి వెళ్లిన యువజంటలో భర్తను కట్టేసి (సినిమా తరహాలోనే) 4గురు యువకులు భార్యపై భర్త సమక్షంలోనే ఒకరి తర్వాత మరొకరు లైంగిక అత్యాచారం జరిపినట్లు 5.7.96నాటి 'వార్త'లో వచ్చింది. సమాజంలో విషరోగంలా విపరీత వేగంతో పెచ్చరిల్లుతున్న లైంగిక అత్యాచార హింసాతత్వాన్ని ప్రతిఘటించవలసిన అవసరాన్ని పై సంఘటనలు మన మొహాన గుద్ది మరీ చెబుతున్నాయి. ప్రజాసాహితి పాఠకులు తగు విధంగా స్పందించి కార్యచరణలోకి కదలాలని విజ్ఞప్తి చేస్తున్నాం - సంపాదక వర్గం.

# సి.బి.సి.ఐ.డి.ల నేర పరిశోధన - ప్రభుత్వం

ఇటీవల ఆంధ్రరాష్ట్ర సి.బి.సి.ఐ.డి నేర పరిశోధనా విభాగం రెండు క్లిష్టమైన కేసులను విచారించింది. వాటిలో ఒకటి - ఎం.సెట్ ఇంజనీరింగు పేపర్ల లీకేజీ గురించి. ఎం.సెట్. పేపర్లు లీక్ అయ్యాయని హైకోర్టు భావించి, ఫలితాలను నిలుపుదల చేయమని ఆదేశించిన తర్వాతనే ప్రభుత్వం సి.బి.సి.ఐ.డి విచారణకు ఆదేశించింది. ప్రభుత్వ పరీక్షా విధానం పట్లే అపవిశ్వాసం పెరుగుతున్న నేపథ్యంలో దాన్ని తుడిచివేయటానికి తప్పని పరిస్థితుల్లో విచారణకు ఆదేశించింది. నేరస్తులందరినీ బయట పెట్టారా? లేదా అన్న అనుమానం ఇంకా తొలగకపోయినా - నేరాన్ని గుర్తించి సరిదిద్దే చర్యలు చేపట్టక తప్పలేదు.

రెండు.. అవనిగడ్డలో జ్యోతి అనే మైనరు బాలికపై గత పార్లమెంటు ఎన్నికల సందర్భంలో అత్యాచారం జరిపి హత్య చేసిన సంఘటన. ఈ కిరాతక నేరం ఎన్నికల పర్యవేక్షణకు వచ్చిన ఆర్‌పిఎఫ్ జవానులపై పడింది. దానిని నివృత్తి చేయవలసిన బాధ్యత కూడా ప్రభుత్వానిదే కనుక సి.బి.సి.ఐ.డి. విచారణ జరిపించి - అసలు నేరస్తులు 15 సం॥ల బాలురు (ముగ్గురి) దిగా కనుగొన్నారు.

పై రెండు సంఘటనలలో నేరస్తులని (సాక్షికంగానైనా) ఒకటి రెండు నెలలలోపే కనుగొనగలిగారు. తదనంతర కేసులు, చట్టపరమైన చర్యలూ చేబడుతున్నారు. సంతోషం!!

కానీ .. 3 సం॥ల క్రితం 6-6-93న పుట్టపర్తి ప్రశాంతి నిలయంలో జరిగిన 6 హత్యలపై కూడా ఆనాటి కోట్ల విజయభాస్కరరెడ్డి ప్రభుత్వం సి.బి.సి.ఐ.డి. విచారణ జరిపించింది. విచారణ నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది. కోట్ల వారి కాంగ్రెసు ప్రభుత్వం ఓడిపోయింది. ఎన్టీఆర్ తెలుగుదేశం గెలిచింది. చంద్రబాబు మామపై తిరుగుబాటు చేసి పార్లమెంటు ఎన్నికల విజయంతో తిరుగులేని (?) నాయకుడైనాడు. 3 సం॥ల కాలం, ముగ్గురి ముఖ్యమంత్రులూ మారినా పుట్టపర్తి కేసుపై సి.బి.సి.ఐ.డి. విచారణ రిపోర్టు పత్రికలలో వెలుగుచూడలేదు. ఏ పత్రికల వారూ దాన్ని ఇటీవల పెద్దగా పట్టించుకోవటం లేదు.

పుట్టపర్తి కేసుని ఎందుకింత రహస్యంగా దాచి వుంచుతున్నారు? నేరస్తుల్ని బహిర్గతం చేస్తే దేశ రక్షణకీ, శాంతి భద్రతలకూ విఘాతం కలుగుతుందా? తమ ప్రభుత్వానికి ఇబ్బందని కాంగ్రెసు వారు విచారణా నివేదికను తొక్కి పట్టారనుకుందాం. కాంగ్రెసు 'దుష్ట సంస్కృతి' కి వ్యతిరేకంగా రంకెలు వేసిన ఎన్టీఆర్, ఆయన అల్లునికీ కూడా యిబ్బందులేమయినా వున్నాయా? పోనీ కమ్యూనిస్టు ఎం.ఎల్.ఎలు (34మంది) బిజెపీ వారు కూడా ఈ విషయంపై నోరు

విప్పరెందుచేత? వీరందరి ఉమ్మడి ప్రయోజనాలకు పుట్టపర్తి కేసు నివేదిక బయటకు రావటం వల్ల నష్టం వాటిల్లుతుందా?

ఏ పార్టీకి చెందిన అసెంబ్లీ సభ్యుడూ పుట్టపర్తి కేసు విచారణ నివేదికను బయట పెట్టమని కోరటంలేదంటే - ఆ కేసులో ప్రజలు తెలుసుకోకూడని భయంకర రహస్యాలన్నీ ఉండి వుండాలి, లేకపోతే వారందరికీ రాజకీయేతరమైన ఉమ్మడి ప్రయోజనాలైనా దాగుండాలని భావిస్తే తప్పవుతుందా'!

వేలాది పుట్టపర్తి బాబా భక్తులు కూడా ఆ కేసు యొక్క నిజానిజాలు తెలుసుకోవాలనే కోరుకుంటారని నేను భావిస్తున్నాను. ఎందుకంటే 'సత్యం' బోధపడితేనే ఎవరికైనా నిజమైన 'శాంతి' దక్కుతుంది. సత్యానికి వారు వ్యతిరేకులనిగానీ, వెరిచే వ్యక్తులనిగానీ అనుకోలేముగదా! సత్యం తెలియనప్పుడు - విపరీత ఊహాగానాలకూ, తీవ్ర నిందారోపణలకూ అవకాశం లభిస్తుంది. కాకుంటే మౌఢ్యంలో జీవించాల్సి వస్తుంది. పౌరులనుగానీ, బాబాభక్తులనుగానీ పై రకపు స్థితిలో మిగిలిపోనివ్వటం రాజ్యాంగం నిర్దేశించిన ఆదేశిక సూత్రాలకు విరుద్ధమైనది.

కనుక ఇప్పటికైనా ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం - లేక ప్రతి (ప్రభుత్వేతర) పక్షాలూ పుట్టపర్తి కేసు యొక్క సి.బి.సి.ఐ.డి విచారణా నివేదికను బయటపెట్టటం - లేక పెట్టించేట్టు చేయటం తమ విధిగా గుర్తిస్తాయని ఆశించవచ్చా?

అనంతవాగ్, కళ్యాణదుర్గం, 6-6-96.

---



## తెలంగాణ పల్లె

-శోధన్

తుపాకులు మాట్లాడిన చోట
గాయాలైన చెట్లు పుష్పిస్తూనే ఉంటాయి.
బతుకులు తలవంచని చోట
కర్తవ్యం, గుండెల్లో ఊపిరి పోసుకుంటుంది.
ఆలోచనలు అంత: ప్రవాహమై
శిధిలమైన బతుకులు త్యాగాల్ని శ్వాసిస్తూనే ఉంటాయి.
స్వేచ్ఛ కాంక్ష చిగురించిన ప్రతి చోట
ప్రతి శిశువు గాయాలపాలు చప్పరిస్తుంది.
జయాపజయాలు రణరంగమైన చోట
ప్రశ్నించే అవసరం ప్రాణానికి తెగిస్తుంది.
కడుపు దహించుకు పోయి - ప్రతి గుడిసె
పరిష్కారన్వేషణకు పూనుకుంటుంది.
గొర్రెల్లా బతికిన గోసి గొంగడి గాళ్ళు
'జులుం" సాగదంటూ జులూస్ తీస్తారు.
గూడెం గూడెమంతా ఆర్తనాదాల్ని ఆరబోస్తూ
మళ్ళీ తుపాకీ సంభాషణ మొదలవుతుంది.
పోరాటం గుండెల్లో పొదిగిన పల్లెలు
ఉగ్గుపట్టుకున్న హృదయంలో
కన్నీళ్ళిచ్చి పుచ్చుకునే సూర్యుడి వంక చూస్తాయి.



# పిచ్చివాడు

- తమ్మినేని అక్కిరాజు

'సత్యం-శివం-సుందరం' బోర్డులు వేదిక చుట్టు అమర్చబడి వున్నాయి. వేదిక వర్ణనాతీతంగా అలంకరించబడి వున్నది. ప్రతి విషయాన్ని డబ్బుతో విలువకట్టే రోజులు కాబట్టి - వేదిక అలంకరణకు 'ఇరవై వేలు ఎస్టిమేషన్' అని చెప్తే సరిపోతుంది. నేనింక వర్ణించ నక్కరలేదు.

ఎదురుగా ఆవరణ 'స్త్రీలకు-పురుషులకు' అంటు వేరు చేయబడి వున్నది. 'ఇంకా బాబా గారు వచ్చేవేళ కాలేదు' అనుకుని ఆవరణలోని జనం అక్కడక్కడ కూర్చుని బాబాగారిపై 'విమర్శలు' కురిపిస్తున్నారు. అది సద్విమర్శ కావచ్చు! దుర్విమర్శ కావచ్చు!

వాలంటీర్లు అటు పురుషుల్లోను, ఇటు స్త్రీలలోను నిశ్శబ్ద వాతావరణం సృష్టించడానికి ప్రయత్నిస్తున్నారు. కాలహరణం అయి పోతున్నా బాబాగారు యింకా రానందుకు కమిటీ వారు చాలా ఆందోళనపడుతున్నారు. భజన బృందం మాత్రం లోకాన్ని మరచిపోయి 'బాబా హరే' అని కాసేపు 'బాబా హరీ' అని కాసేపు బాబా భజన కొనసాగిస్తూ తన్మ యత్వంలో వున్నారు. ఆవరణలో అన్నివైపులకు వినిపించేటట్లు ఏర్పాటుచేసిన పన్నెండు 'లౌడు స్పీకర్లు' 'ఓంకార రూపాన్ని' 'వికార రూపం' గా మార్చి ఆవరణ గోడల్ని పగలగొట్టేస్తు న్నాయి. భక్తులు టాక్సీల మీద, రిక్షాల మీద, సొంతకార్ల మీద వస్తున్నారు. దేనికి నోచుకోని వాళ్ళు 'సొంత కాళ్ళ' మీద ఉరుకులు, పరుగులతో వస్తున్నారు.

"భక్త మహాజనులారా! అంతా నిశ్శబ్దంగా వుండండి. మన పూర్వజన్మ పుణ్యఫలమా అన్నట్లు 'జాబాలి బాబా'గారు రాబోతున్నారు. మన కండ్లు మిరుమిట్లు గొలిపేటట్లు ఆ తేజో స్వరూపులు మనకు దర్శనమివ్వబోతున్నారు' ' కమిటీలో ఒక వ్యక్తి ప్రకటించాడు.

ఆ ప్రకటనతో ఆబాలగోపాలం 'జాబాలి బాబా'ను చూడ్డానికి వేదిక ఎదురుగా 'ఎరక్ట్' అయిపోయారు. కొందరు మాత్రం అలాగే కూర్చుని యింకా విమర్శిస్తూనే వున్నారు. మరొకసారి ఎవరిస్థానాల్లో వారు కూర్చోవాలని ప్రకటనలు వినిపించాయి. జనంతో ఆవరణ నిండుగా వుంది. ఇది రాజకీయవేదిక అయితే జనాన్ని 'లారీల మీద' తోలుకొచ్చేవారు - కాని ఇది ఆధ్యాత్మిక వేదిక! 'అంతరాత్మ' ప్రబో ధంతో వచ్చే జనం వీరంతా! అయినా అను కున్నంత జనం రాలేదని కమిటీ వారు చాలా బాధపడిపోతున్నారు.

★ ★ ★

ఇంతలో ఒక విచిత్రం జరిగింది. సాదా బట్టల్లో గెడ్డం మాసిన ఓ వ్యక్తి వేదిక మీదికొచ్చి - ఓంకారమూర్తి శ్రీమాన్ బాబాగారి కోసం ఏర్పాటు చేసిన సింహాసనంపై కూర్చున్నాడు. అంతే - భూమి దద్దరిల్లింది. ప్రళయం వచ్చింది. బహుశ కలియుగావతారుడు 'జాబాలిబాబా' గదిలో వుండే శపించి వుంటాడు! ఇక్కడ వీడి వీపు చిట్లింది. కమిటీ వారు రెండు బాది వాడిని కిందకి దింపేశారు.

తన్నులు తిని వాడు తిన్నగా పోయి వేదికకు ఎదురుగా వున్న 'కాంపౌండ్ వాల్' దగ్గర తపస్సు చేస్తున్న భంగిమలో కూర్చుని ఏదో గొణుక్కుంటున్నాడు. అంతవరకు జరుగుతున్న తతంగాన్ని పరిశీలిస్తున్న నేను, నా మిత్రుడు 'సద్గురు' అతని దగ్గరకు వెళ్ళాం. భయం లేదు. వివరాలు చెప్పమన్నాం. కాని అతడు మాట్లాడలేదు. అసలీ లోకంలోనే వున్నట్లు లేదు. కాసేపు కళ్ళు మూస్తాడు. కాసేపు తెరుస్తాడు. మధ్యలో వింతగా

వవ్వుతాడు. మేము రెండు, మూడు సార్లు అతన్ని మాట్లాడించటానికి ప్రయత్నించి విఫలమయ్యాం. ఇంతలో మాచుట్టూ జనం మూగారు. ఆ జనంలో ఒకాయన -

"ఈ వ్యక్తి బాబాగారి ముఖ్య శిష్యుడు. నేను బాబాగారిని దర్శించటానికి 'రాద్ధాంత పురం' వెళ్ళినపుడు చూశాను. అక్కడ ఇతను సృష్టించిన 'రాద్ధాంతం' యింతా అంతా కాదు. ఏకంగా బాబాగారి మీదకే ఎగబడ్డాడు. ఇతన్ని బాబాగారి మనుషులు తీసుకుపోయి, ఏదో షాక్ ట్రీట్‌మెంట్ యిచ్చారు. అప్పటి నుంచి యితను యిలా అయిపోయాడు. ఎందుకిలా అయిపోయాడో, ఆ బాబాగారికే తెలియాలి' అని ముగించాడు.

ఆ గుంపులోంచి ఒక వ్యక్తి ముందుకు వచ్చి -

"అంతా ఆ బాబాగారి దివ్యచిద్విలాసం. ఎవరికి ఏం చెయ్యాలో ఆ మహానుబావుడికి బాగా తెలుసు" అన్నాడు.

"చిద్విలాసం కాదు - సింగినాదం కాదు. బాబాగారి 'రహస్యం' ఏదో యితనికి తెలిసి వుంటుంది. అందుకే ఇతనికి పిచ్చెక్కటానికి ఏదో విషప్రయోగం చేసి వుంటాడు' అన్నాడు ఒక నాస్తికుడు.

ఆ మాటలకు ప్రక్కనే వున్న ఒక భక్త శిఖామణి ఒళ్ళు మండిపోయింది. "బాబాగారికి రహస్యాలేమిటయ్యా! ఆయన ఏమన్నా అంతర్జాతీయ గజదొంగ అనుకున్నావా? స్మగ్లర్ అనుకున్నావా? ఆయన సాధు పుంగవుడు. సచ్చిదానంద స్వరూపుడు. చేసేవేవో మంచిపనులే చేస్తున్నాడు. 'అంతరార్థం' గ్రహించలేక మాట్లాడటమేగాని - ఆయన చర్యలన్నీ మానవుడి కనీసావసరాలు తీర్చటానికేనని తెలుసుకో!" అన్నాడు కోపంగా.

"గాలిలోంచి బంగారు గొలుసు సృష్టించటం - మానవుడి కనీసావసరం తీర్చే చర్య అంటావా?" అని అందుకున్నాడు ఒక కాలేజి విద్యార్థి.

"ఎంతసేపూ అదే చూస్తారు గాని - ఆయన నిర్వహిస్తున్న విద్య, వైద్యం, రక్షిత నీటి పథకాలు ..... యివన్నీ ఏమిటి? దేశాన్ని పాలించేవాళ్ళే యీ సమస్యల్ని తీర్చలేక తల్లక్రిందు లౌతున్నారు. అందుకే వాళ్ళు కూడా అప్పుడప్పుడు బాబాగారిని దర్శించి శ్రీవారి ఆశీస్సులు పొందుతున్నారు" అన్నాడు చిద్విలాసంగా భక్తుడు.

"నిజమేనయ్యా! కాని గాలిలోంచి బంగారు గొలుసులు తియ్యటం ఏమిటి? అది సాధ్యమా?" అన్నాడు విద్యార్థి.

"సాధ్యాసాధ్యాలు నీకేం తెలుస్తాయి. ఎన్ని అసాధ్యాలు సాధ్యాలు కావటం లేదు. గాలిలోంచి 'బొమ్మ' వచ్చి టి.వి. తెరమీద పడుతుందని, ప్రపంచాన్ని మనం ఇంట్లో కూర్చుని చూస్తామని, యిది సాధ్యమౌతుందని, ఏనాడైనా మన పెద్దలు అనుకున్నారా? అది సాధ్యం కాలేదా? అలాంటిదే యిదీను".

"దానికి దీనికి సంబంధం ఏమిటయ్యా బాబూ! అది సైన్సు. దానికొక సైంటిఫిక్ రీజన్ వుంది. గాలిలోంచి వస్తువులు సృష్టించటం సైన్సు కాదు కదా! తెలివితక్కువ మాటలు మాట్లాడతావే?"

"తెలివితక్కువ నాది కాదు - నీది. ఒకనాటి అసాధ్యాలు నేడు సాధ్యమౌతుంటే - నేటి 'అసాధ్యాలు' రేపటికి ఎందుకు 'సాధ్యాలు' కావు? బాబాగారి చర్యలన్నీ సైన్సే - నువ్వింక మాట్లాడకు!" అని రెచ్చిపోయాడు భక్తుడు.

నోరు విప్పితే తన్నేటట్లు వున్నాడు. గంట క్రితమే కోటి రూపాయల 'చెక్కు' బాబాగారికి ప్రజంట్ చేసిన 'మహాభక్తుడు' ఆయన!

★ ★ ★

ఇంతలో ఒక పంతులుగారు గబగబా మా గుంపును చీల్చుకుంటూ లోపలికి

చొరబడ్డాడు. తపస్సు చేస్తున్న 'పిచ్చి వాడి'కి సాష్టాంగ ప్రమాణం చేశాడు. అతని చర్యకు మేము ఆశ్చర్యపోయాము.

ప్రక్కనున్న వారు "ఏమిటి?" అన్నారు.

"ఏమో తెలీదు. ఆయన్నే అడగండి".

ఒకాయన ధైర్యం చేసి అడిగాడు.

అడిగిన వ్యక్తిని ఆ పంతులుగారు ఎగాదిగా చూసి -

"మీకేం తెలుసు. ఆ సింహాసనం ఎవరి కోసం ఏర్పాటు చేశాము? శ్రీమాన్ బాబాగారి కోసం! అలాంటి స్థానంలో యీ మహాను భావుడు కూర్చున్నాడు. అంత దైవ చిద్విలాసం. ఈ పుణ్యమూర్తి పూర్వజన్మ సుకృతం మహాప్రభో... ప్రణామాలు..." అంటూ అరుచుకుంటూ పోయాడు.

'వీడొక పిచ్చివాడిలా వున్నాడు. పిచ్చివాళ్ళు ఎక్కువైపోయినట్టున్నారే యిక్కడ' - అనుకుని మేము నవ్వలేక చచ్చాం. ఇంతలో వేదిక మీది నుండి, "పిచ్చివారొస్తున్నారు నిశ్శబ్దం" అన్నారెవరో! ఆ ప్రకటన విని జనమంతా అవాక్కయిపోయారు. అక్కడ వున్న గుంపు మొత్తం వేదిక వైపు తిరిగింది. క్షణంలో ఆ నిశ్శబ్దం బ్రద్దలై - ఈలలూ, చప్పట్లూ, రణగొణ ధ్వనితో గందరగోళం అయింది. ఎక్కడివార క్కడే నవ్వలేక చస్తున్నారు. "మరో పిచ్చివాడట ... మరో పిచ్చివాడు,..." అందరూ అదే మాట. అంతలో వేదికపైనుండి ప్రకటించిన వ్యక్తి తన పొరపాటుకు నాలుకొరుక్కున్నాడు.

"అయ్యా! నన్ను క్షమించండి. ఇంతవరకు ఆ పిచ్చి వెధవ గొడవలో పడి ... శ్రీమాన్ బాబాగారిని కూడా 'పిచ్చివాడు' అనేశాను. నన్ను క్షమించాలి. మీరు క్షమించినా, బాబాగ -ారు నన్ను క్షమించరు. నా నోరు పక్షవాతంతో పడిపోతుంది. 'బాబాజీ' నువ్వే రక్ష ... నువ్వే రక్ష!'..." పరుగెట్టి కెళ్ళిపోయాడు పిచ్చివాడిలా!

"అయ్యో! యీయనకు కూడా పిచ్చెక్కిందా ఏమిటి?' మాకు భయంవేసింది. అక్కడ వుంటే మాకు కూడా పిచ్చెక్కుతుందని, యింతలో గోడ దగ్గర కూర్చున్న 'తపస్వి' నెమ్మదిగా పైకి లేచాడు. నెత్తి మీద గాంధీ టోపీ వుంది. దుస్తులు కూడా ఖద్దరే! చొక్కాకు రెండు జేబులు - జేబుల నిండా కాగితాలున్నాయి. ఒక జేబులో పెన్ను కూడా వుంది. మనుషుల్ని చూస్తున్నట్టు లేదు. ఎక్కడో విశ్వాంతరాళాల్లోకి చూస్తున్నాడు. ఆ చూపు నిజంగా భయం వేస్తోంది. ఏదో చెప్పటం మొదలుపెట్టాడు. అతనికి 'జ్ఞానోదయం' అయిందనుకుని చెప్పేది వినటానికి ఉపక్రమించాం -

'నేను చెప్పేది వినండి. నేను పిచ్చివాడిని కాదు. నాకు ఎలాంటి పిచ్చి లేదు. నేను ముస్లిమ్ యువకుడిని. ఎం.ఎస్‌సి. చదివాను. కాని ఉద్యోగం లేదు. మా పెద్దవాళ్ళు తొందర పడి నాకు వివాహం చేశారు. వెంటవెంటనే ముగ్గురు పిల్లలు పుట్టారు. చదువు ... పెళ్ళి ... పెళ్ళాం .... పిల్లలు.... కాలచక్రం తిరిగి పోయింది. సమస్యలు పెరిగిపోతున్నాయి. కాని ఉద్యోగం రాలేదు. క్రమంగా ఇంట్లో వాళ్ళకి యీసడింపుగా తయారయ్యాను. ఎలా బ్రతకాలో తెలియటం లేదు. ప్రతి క్షణం అంతరాత్మ క్షోభిస్తూ వుండేది. ఈ బాధ భరించలేక ఒకరోజు పెళ్ళాం పిల్లలతో బయలు దేరి 'రాద్ధాంతపురం' చేరాను. అక్కడ జాబాలి బాబాగారి కాళ్ళ మీద పడ్డాను. వారు ప్రసన్ను లయ్యారు.

"ఏమిత్రా" అన్నారు నన్ను ముట్టుకో కుండా!

"ఏమిటే" అన్నారు నా భార్య తలమీద చెయ్యి వేసి వీపు వరకు సవరిస్తూ!

ప్రతి గురువారం 'బాబాగారి పైకి' శ్రీకృష్ణ పరమాత్మ వస్తాడు. ఆ గోపికాలోలుని ప్రవేశం జరిగినప్పుడు బాబా ఎవ్వరినైనా 'ఒరే' అని, 'ఒసే' అని సంబోధిస్తారు. మా బాధలన్నీ

చెప్పుకున్నాము. మమ్మల్ని తన వద్దనే వుండిపొమ్మన్నారు.

నాటి నుండి నేను, నా భార్య బాబాగారి సేవ చేసుకుంటూ, జీవితం గడిపేస్తూ వచ్చాము. మా పిల్లలు బాబాగారి వేదపాఠశాలలో చేరి చదువుకొంటున్నారు. అక్కడ కులం, మతం లేని మహోన్నత సమాజం వున్నదని మురిసిపోయాము. బాబాగారి దివ్య సందేశామృతంతో మా జీవితం ధన్యమైనదనుకున్నాము. మూడు సంవత్సరాల కాలం ఆకలి బాధలు, ఆటంకాలు లేకుండా గడిచిపోయింది.

కాని -

ఒక దురదృష్టకరమైన రోజు ....

అనుకోని సంఘటన నా జీవితంలో ఎదురైంది ..."

అంతవరకు చెప్పి ఆగాడు. గుటకలు మ్రింగుతున్నాడు. నోరు తడి ఆరిపోయినట్టుగానూ, పెదవులు ఎండిపోతున్నట్టుగానూ, ముఖం పాలిపోయినట్టుగానూ కనిపించాడు. నేను వెంటనే ఒక గ్లాసుడు మంచినీళ్ళు తెచ్చి యిచ్చాను. తాగిన తరువాత కొన్త తేరుకున్నాడు.

"ఆ రోజు ఏం జరిగిందో చెప్పు" అన్నాడు మా సద్గురు.

"ఒక ఫారిన్ లేడి ఆ రోజు బాబాగారిని చూడటానికి వచ్చింది. నేను ఏదో తొందంపాటుతో, ఆమెను చూసిన కంగారులో బాబాగారి అనుమతి లేకుండా వారి ప్రత్యేక మందిరంలోకి వెళ్ళాను. అక్కడ నేను చూసింది కూడా ఏమీ లేదు. బాబాగారు భూగర్భ గృహం నుండి పైకి వస్తున్నారు. ఆ గదిలో ఒక భూగృహం వున్నట్లు నాకు అప్పుడే తెలిసింది. అంతలో నా మెడ మీద ఒక పెద్ద దెబ్బపడింది. ఎవరు కొట్టారో, దేనితో కొట్టారో నాకు తెలీదు. ఆ తరువాత నేను కోలుకోవటానికి చాలా రోజులు పట్టింది. నా భార్య నా మంచం దగ్గర కూర్చుని, కుమిలి కుమిలి ఏడుస్తూ వుండేది. నెలరోజుల తరువాత మేము మా ఊరు వచ్చేశాము".

"ఆ తరువాత ఏమయింది?" అన్నాడు మా సద్గురు ఆతృతతో!

"ఆ తరువాత కథ నేను చెబుతాను" అన్నాడు అక్కడకు అప్పుడే వచ్చిన ఒక గెడ్డం సాయిబుగారు. మనిషి చాలా హుందాగా, గౌరవనీయుడైన వ్యక్తిలా కనిపించాడు. కాని అతని కళ్ళలో అంతులేని దైన్యం కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది.

"ఇతను మా అబ్బాయి. 'ఆ రోజు' నుండి వీడికి మతిస్థిమితం లేదు. ఒకోసారి బాగానే మాట్లాడతాడు. ఒకోసారి పిచ్చిపనులు చేస్తాడు' ' అని చెప్పి అతనిని అక్కడి నుండి తీసుకుపోయాడు.

★ ★ ★

"ఏమిటిదంతా?" అన్నాడు మా సద్గురు ఆశ్చర్యంగా!

"లోకంలో అనేకం జరుగుతున్నాయి. అన్నిటికి మనం సమాధానం చెప్పలేము. చెప్పగలిగినా కొన్నిటికి నోరు విప్పలేము. ఆగర్భ శ్రీమంతులున్నారు మన దేశంలో, ప్రక్కనే ఆగర్భ దరిద్రులున్నారు, హంతకులు, దేశద్రోహులు, కిరాయిరౌడీలు, స్వేచ్ఛగా జీవిస్తున్నారిక్కడ. దైవభక్తితో అలౌకికానందం పొందే నిజమైన భక్తులూ వున్నారిక్కడ, దొంగభక్తులూ వున్నారు. దేశం కోసం ప్రాణాలను సైతం లెక్కచేయక పోరాడుతున్న వీరులున్నారు. దేశం ఏమైతేనేమి- మనం బాగుపడితే చాలనుకునే అధికారులున్నారు. భార్యను చంపి పొయ్యిలో కాల్చే నరరూప రాక్షసులూ, ముక్కలు ముక్కలుగా నరికి మొసళ్ళకు ఆహారంగా వేసే నరకాసురులూ ... మహానాయకులై చెలరేగిపోతునారు. రోజుకొక 'కుంభకోణం'తో ప్రజాధనం

# సారాపోరాటం వర్ధిల్లాలి!

## ఏకపాత్రాభినయం

- నిశితాసి

పెతోడు తిండి కోస మాలోసిత్తున్నారా! గుడ్డకోసమాలోసిత్తున్నారా! బుడ్డీకోసమె. ఒక్కబుడ్డీ కోసం ఆలోసిత్తున్నారంటే లోకం నమ్మదు. ఈలోకం మాత్రం దానితోనె నడుత్తున్నాదంటే అచ్చెరవె ఎగ్గు. ఎందుకినాగ అవతందో ఒక్క నివషం ఆలోసించండి. ఆలోసిత్తే గుండె తరుక్కు[illegible]తాది. అసలీ దేశములో ఏమి జరిగిపోవాలన్నా బస్తాకి తప్ప మరిదేనికి చేతకాని పెరిత్తితి వొచ్చేసింది. చిన్న మొగుడూ పెల్లాల గొడవ మొదలుకొని చీపిమినిట్రో - పైమినిట్రో అయినవరకు ఈ బస్తాల పుణ్ణెమె. ఈ బస్తాలకి యింత చరిత్ర ఉంది కామట్టే నేను ఒక్క నివషం మీతో తలబోసుకుంతాను.

నేనూ తాగినోడునేనయ్యా! మాయయ్య మేకలు కొన్నప్పుడో, గొర్రులమ్మినప్పుడో ఖర్చు కింద బుక్కడు పుచ్చుకునేవాడిని. అదేటను కున్నావు? యిప్పసారా.... దాని తస్సాదియ్య! మాగొప్ప గుండేది. మరిప్పుడో సర్కారి బస్తాలొచ్చినాయి. బస్తామీద బస్తా మీద బస్తా బస్తా మీద బస్తా. బస్తాకి బస్తాకి అరగంట గేపుంటే చాలు. పొద్దంత తాగుకోనీ యిట్టం. ఏటీ కాదు గాని తెల్లారి మాత్రం సూసుకోం కాలుపీకులు-కల్లుమంట, వొల్లు లెగదు. నెగాలంటే మల్లీ బస్తా ఏసు కోవాలి. ఒక్క బస్తా ఏ సీసుకుంటే సరిపోదు. దాని పక్కన వక్రనీరు కావాలి. దానికి దీనికి సంపాయించినదంతా సరిపోతాది. ఇక పెల్లాము పిల్లల సంగతి మరి సెప్పనక్క

---

గల్లంతవుతున్న సంఘటనలు రోజూ మనం పేపర్ల నిండా చూస్తున్నాము... వీటన్నిటికీ సమాధానం ఎవరు చెబుతున్నారు? అలాంటిదే యిదీను!" అన్నాను నేను.

ఇంతలో వేదికపై నుండి -

"బాబాగారు రావటం లేదు. డా॥ కళావతిగారు ఏర్పాటు చేసిన ప్రత్యేక మందిరంలో భక్తులు బాబాగారిని కలుసుకోవచ్చు. వారి వారి సమస్యలను పరిష్కరించుకోవచ్చును" అని ప్రకటన వినపడింది.

ఆ ప్రకటనతో జనం 'హాలో' మంటూ లేచిపోయారు. ఆ గోలకు ప్రక్కనే చెట్ల మీద వున్న కాకులు 'ఏమిటా యీ కాకిగోల' అని తలలు క్రిందకు వంచి చూస్తున్నాయి. ఇంతలో సన్నటి చినుకులు కూడా ప్రారంభమైనాయి.

"కళావతి గారి మందిరానికి వెళదామా?" అన్నాడు మా సద్గురు.

"ఎందుకు? ఆవిడ బాబాగారి పిచ్చిలో పడింది. ఈ లోకంలో ఒక్కొక్కరికి ఒక్కొక్క పిచ్చి. మనకు ఏ పిచ్చి ఎక్కకముందే తిన్నగా రూమ్‌కి వెళ్ళి శ్రద్ధగా చదువుకొందాం" అన్నాను.

"జైసద్గురు" అనుకుంటూ ఇద్దరం హాస్టల్ వైపు కదిలాం. 'పిచ్చి పిచ్చి పిచ్చి, రకరకాల పిచ్చి, ఏ పిచ్చి లేదనుకుంటే అదీ ఒక పిచ్చి' - అన్న భానుమతి పాట దూరం నుంచి విని పిస్తోంది. మేము నడుస్తున్నామే కాని - ఆ ముస్లిం యువకుడి జీవన దృశ్యం ఒక 'మిస్టరీ' గా మా కళ్ళలో కదలాడుతూనే వున్నది. ☆

ర్నేదు. తాగేసి, నేను నెగలేను కదా. తప్పు నాది కదా... అది గెయించ కుండా-

"ఓలెనంజికానా, యినబడదా.. బస్తాపట్రాయె" అని అరవడం, నాపెల్లాం చాలా మంచిదాయి. అర్జెంటుగా నేసిపోయి, గుడ్డి దుక్కు ఎల్లి పోవాలని తెచ్చి యిత్తాది. నేకపోతె నెగలేనుకదా. నెగనంతె నెగను. అహ. అది నెగవ్వదు. అందుకని మాదాయి సల్లగా కొంగులో దాసుకొని, పట్టుకొత్తాది. అంతటితో వూరుకుంతానా. నిషా, నిషా ఎక్కాలి కదా... మళ్ళీ బస్తా మీద బస్తా బస్తామీద బస్తా ...వరసగా ఐదారేసుకొని ఆ రోజంతా గడిపెత్తాను. ఇలాగ నా కాలమంతా సారాకి ధారవోసి, యిలా అయిపోనాను.

ఈ నిషామీద అన్నీ పోగొట్టుకున్నాను, ఆత్తులు పోనాయి. ఆరోగ్యం పోనాది. నాపెల్లాం యినాగ తోటకాడ, నాగ అయిపోనాది. అన్నీ పోనాయిగాని 'నిసాకిసారమా' అని పదిమంది పిల్లలని మాత్రం పుట్టించేసినాను. ఇంతమందికి ఒక్క ఆడదే అయితే కట్టమని ఇద్దరికి పంచేసినాను. ఒకటి మాయయ్య చిన్నప్పుడు చేసిన సంబంధం. మాయమ్మ జబ్బుతో ఉన్నప్పుడు వేగిరం పెల్లి నాకు చేత్తే చూసి సచ్చిపోతానన్నదట. అందుకని గావల్ల మీసం రాకమునుపే పెల్లి చేసేసినారు. వరుసగా ఆరుగురిని పుట్టించినాను. అదేమో జబ్బు పడి పోనాది. నేను మంచి వయసులో ఉన్నాను కదా. ఒక ఆడదాని పంచలో చేరినాను. సరదాకి కదా అని సూసుకుంటే అది పెల్లమై కూసుంది. సూసుకోయిక దానికి నలుగురు పుట్టేసినారు. ఈ సారా నాకినాగ చేసిందంటే "నీ పోయకాలమంతారు" పోనిలే అదిక్కడకి వొదిలెత్తాను.

పాపిట్టి కడుపులో పుట్టినాను. గొప్ప యిదయి పోనాను. అన్నీ పోగొట్టుకున్నాను. బుద్దొచ్చింది. నాభమేటి? చేతులు కాలిన తరువాత ఆకులు పట్టినట్లు. పోని నేనెంత తాగి నోడినయిన పిల్లలకి ఎనాగో సేసి పెంచి పెద్ద సేసినానా! వొదిలేసినానా. అంతెందుకు? నా చేతులతోనే మాయయ్యకి ముంతలు ముంతలు యిప్పసారా అందిచ్చి, పుట్టించినందుకు రునం తీర్చికున్నాను.

ఇప్పుడు నాకొడుకు నేడు... పెద్ద దానికి పుట్టిన పెద్దకొడుకు. ఫుల్లుగా పని చేత్తాడు. ఫుల్లుగా తాగొత్తాడు. ఫుల్లుగా నాక్కొడతాడు. రోజా కొట్టడమే అడమ్మ కడుపుమాడా. నాకయితే బాగున్ను, నాకే కాదు-అడి పెల్లం నేదూ.. ముందు ఇనిమీద అని మీదెట్టుకొని దానికోపాసరు వాయించెత్తాడు. ఈరెండు కల్లుతో చూడనేక, మనసొప్పక అడ్డడానికెల్లాను. దాని కొదిలెత్తాడు, ఒంగోలాబోతునాగ నా మీద పడతాడు. మంచిగా ఉన్నప్పుడు అగిత్తానంతే. ఒక్కరోజా మంచిగా ఉండడు. అది రోజా యిడి బాధ పడనేక అల కన్నోరింటికి ఎల్లిపోనాది. ఇప్పుడైన మడిట్టమయిపోనాది.

"ఓరి నంజికొడకా! పెల్లాము నొదిలేసి యిలగేటి తిరిగితావురా" అంటే "నాయిట్టం" అంతాడు.

ఏటిసేత్తాను. కాసినాను. పూసినాను. కర్మమెత్తానా... చెప్పండి బాబు. ముసిలైనాను గాని అలమ్మకి ... అదే నా పెల్లానికి ఒక్క దెబ్బకొట్టనేదు. సీతరాములు నాగ ఎంచక్కో బతికేసినాము. ఇవేమి రోజులో గాని తాగడం పెల్లానికి చితక్కొట్టడం. తాగడం యిట్ట మొచ్చినట్టు తిరగడం. మాయింటి పెరిత్తితి యినాగై పోనాది. ఈవన్ని చూత్తుంటే నాకెందుకు దేముడొది లేసి వాడని

మా చెడ్డ దుఃఖ మొత్తంది. ఇనాగెన్ని కుటమానాలు నాసనమవు తున్నాయో... ఆలోసిచ్చండి బాబు... ఈ సారా నేకపోతే బతకనేమా... అసలిది కూడా అంబలా.... ఇన్నాలయితే ఎక్కడో... ఎవలో ఒకలు నాటొండేవోలు. పనీపాటు చూసికొని కాసింత పుచ్చుకునేటోల్లం.

ఇదేటోలమ్మ. సందు సందుకీ సారా కొట్టే. సారాకొట్టు లేని గేమమున్నాదా? గెవనమెంటు ఈ ఏపారమెందుకు చేత్తంది? ఎవల నుద్దరించడానికి చేత్తంది. పెతోడు "పెజలు, పెజలూ" అని అరుత్తారు. తాగడానికి నీరు నేకపోయినా పరమానేదు గాని, సారా మాత్రముండాలి. మనం చచ్చి చెడిపోయినా పరవా నేదు గాని, పెభుత్వానికి రాబడి కావాలి.

"తు(...నాకొడకల్లారా...చీమూనెత్తురుందిరా..." అలపేర్లు చెప్పి సారా యిచ్చి ఓటు వేయించుకుంతున్నారు. గేందీగారు సారా పెట్టమన్నారా? చెప్పండి బాబు.. మీరు చెప్పండి. నిసేదించమన్నారు. మరికెవలు, మన లన్నేలుతున్న మాన బాబులు ఎవలు? సారా ఎజమానులు..... మనూరి పెసిడెంటు నుండి అయిదిరాబాదు కెల్లిన వరకు పెతోడు సారా అమ్మినోడు, అమ్మించినోడే అదికారులు...ఇలధికారాలు గంగలగలప....

బాబులో... ఆలోసిచ్చండి, రౌడీలు, సారా ఎజిమానులు ఈ దేశాన్నేలుతున్నారు. సారా మనం బందు చేయమంతే మనోలు చేతే సారా తాయిపించి మనలనే తన్నిత్తారు. అంత గొపోవెలు మన నాయకులు. అందుకే బాబు దేశం పాడయిపోనాది. ఇల పదవులు నిలుపుకోడానికి పెజలకి సారా లిత్తారు. ఆ సారా తాగిన మనం, మనమాలోసించాలి. దేశములో ఆడదానికి మనబంగం జరిగిందంటే, అడు సారా తాగేచేత్తాడు. ఒక మడ్డరు జరిగిందంటే... అది సారా తాగే చేత్తారు. దొంగతనం జరిగిందంటే సారా లాగే చేత్తాడు. ఈమగ మారాజులకి సారా యజమానులు తోడై నేల లోకమే చీకటయి పోతాది బాబు. చీకటయిపోవల్ల ఈచీకటి బజారులను చెండాడేవల్ల ఈ దొంగ పెబువుల పదవులు ఊడపెరికేయాలి. బూతంలాటి ఈ సారాని పిసాచుల్లాంటి ఈ సారా తాగినోల్ల ఆటలు కట్టాలంటే ఒకటే దారి. ఆడోలు..ఆడోలాలోసించాలి. ఆడమ్మలు మంత్రగాల్లాగ బయలుదేరి భూత పీడ పిసాసులను ఎంటబెట్టి... ఎంటాడి సీసాలో ఏసి సీలేసి భూమిలో పాతరెయ్యాల. అప్పుడు గాని ఈ దేశం బాగవుదు.

అమ్మలను గన్న అమ్మలో... మీరు ఆదిశక్తి అవతార మెత్తాలమ్మా.. నేకపోతే ఈదేశం బాగవుదు. ఈదేశంలో రాచకీయమే ఏపారమయిపోనాది. మన కుటమానాలు నాసనమయిపోతాయి యింకా నాశనమైపోతాయి. అందుకే ఆడదాయి పెతీ ఆడదాయి ఆదిశక్తయి పోవాలి. మీరు నేకపోతే మేము లేమమ్మా ఈ దేశం మీది. ఈపెపంచమంతా మీదమ్మా.. మీమంతా నీకొడుకులమమ్మా... తప్పకుండా మాసాయం మీకుంతాదమ్మా., చేయండి, సారా పోరాటం చేయండమ్మా.. మీ మొగ్గల్లుతో తన్నించుకున్న తాపులు కన్నా ఈ పోలీసోలు దెబ్బలు పెభుత్వం పెట్టిన కేసులు అంత కట్టమైనవి కావమ్మా.. ఝుడకండి.. ఎన్నికట్టోలొచ్చినా పరవాలేదు. రానున్న రోజులు 'మీయె., చేయండి పోరాటం, సారా పోరాటం వర్థిల్లాలి."

✦



# ఎక్కడో పడిపోయింది తాళం చెవి !

- నిఖిలేశ్వర్

ఎక్కడో పడిపోయింది తాళంచెవి,
గోడల కావల విసిరేసి
జైలు అధికారులు గుర్రు కొడుతున్నారు హాయిగా !
ఈ కులమతాల పరాధీన వ్యవస్థలో
వెలుపలి లోపలి జైళ్లలో
పదోక్లాసు ఖైదీలమే మనమంతా!
గతిలేక మనమే ఎన్నుకున్న
కాపలాదార్లు నలువైపులా!
అన్నీ రూల్స్ ప్రకారమే
వలస కాలంనాటి మాన్యుల్ ప్రకారమే
మన తిండే పంచుకుంటున్నారు ఈ అధికార్లు
నిశ్చింతగా సుఖంగా నిదురపోయి
బొజ్జలు పెంచే దురాశతో వచ్చే తరాల దాకా!
స్వేచ్ఛ చుట్టూ తాళాలు బిగించి
ఎక్కడో తాళం చెవుల్ని పారేసి
నీలుగుతున్నారు తుపాకుల నీడపై !
శ్రమజీవికి ఎప్పుడైనా మనుగడే ఒక ప్రశ్న
న్యాయంగా రావలసిన ఫలితం దక్కనివ్వని ఉన్నతవర్గాల
వకాల్తా పుచ్చుకునే ధర్మశాస్త్రాలు
విలువల్ని పాతిపెట్టి మానవాంశతో ఆడుకునే వ్యాపారాలు!
ఈ బందీఖానాలోనే సహజీవన-
నాటకం పోషిస్తున్న దొంగల ముఠాలకు
పారేసిన తాళం చెవుల ఆచూకి చెప్పిన జైలర్లు,
చుట్టూ నిర్బంధపుటెడారి
నాలుకలు తడుపుకోవాలంటే
ఇప్పుడిక మన చెమట చుక్కలే ఆసరా,
రాజ్యాంగమే పుచ్చిపోయినపుడు
గోడలు దూకో సొరంగాలు తవ్వో
డైనమెట్లు పేల్చో ఎప్పటికైనా
మనమే వెతుక్కోక తప్పదు-
జైలు అధికార్లు పారేసిన తాళం చెవుల్ని !

☆

# అరగాన్ నుంచి ఒక ఉత్తరం

ఆంగ్లం:జాన్ కార్న్‌ఫర్డ్

అనువాదం: విపుల్ చక్రవర్తి

ఏ అలజడిలేని ప్రశాంత రణరంగంలో
ఒక ప్రశాంతమైన యుద్ధంశ్రేణి

కొత్త శవపేటికలో
పూడ్చిపెట్టిన రూయిజ్ శవం
కప్పిన తెల్లగుడ్డ చిన్నది
పొడుచుకొచ్చిన పాదాలు
ముక్కుపుటాల్ని బద్దలు కొడ్తూ
దూసుకొస్తున్న దుర్గంధం
ముక్కులకి చేతిరుమాళ్ళు చుట్టుకున్న
శవ వాహకులు కొందరు
అది ఘనత వహించే చావు కాదు
పరాయిగడ్డ మీద నేలని పొడిచి పొడిచి
తవ్వాము గోతివి
ఆదర సూచకంగా సమాధి మీద
ఒక్కమ్మడిగా పేల్చాము తుపాకులు

ఏ అలజడీలేని ప్రశాంత రణరంగంలో
ఒక ప్రశాంతమైన యుద్ధశ్రేణి
శత్రువు ప్రయోగించ లేదు విషవాయువు
కర్ణపటాలు బద్దలయ్యేలా విస్ఫోటన
జరగలేదు

గ్రామం శివారులో కురిసిన బాంబు
వర్షానికి వీధులన్నీ ధూళితో నిండిపోయి
వూపిరి సలనటం లేదు
ఇళ్ళల్లో గోడపెచ్చులు దడదడమని
రాలుతూవుంటే
చంకల్లో పసిబిడ్డల్ని ఎత్తుకుని
భీతితో ఆర్తనాదాలు చేసుకుంటూ
వీధుల్లోకి పరుగులుతీస్తూ ఆడవాళ్ళు
ఎంత జుగుప్సాకరమైనది ప్రాణభయం

ఏ అలజడీలేని ప్రశాంత రణరంగంలో
ఒక ప్రశాంతమైన యుద్ధశ్రేణి
భావోద్రేకం తగ్గి నరాలన్నీ సర్దుకున్నాక
అంత నిద్రపోయాం హాయిగా

పరిశుభ్రమైన ఆసుపత్రి బెడ్
బరువెక్కిన నా కళ్లు
తుడిచివేస్తూన్న నిద్ర
బొమ్మకట్టిన జుగుప్సాకర చిత్రాన్ని
గాయపడిన స్వచ్ఛంద్ద సైనికుడు
స్ట్రెచర్ మీద రోధిస్తూ
తొలగిన ప్రమాదకర పరిస్థితి
దాహం తీరక అతని రోదన
చావంటే భయమెరుగని జగమొండికి
అలవాటు కానిదీ నెప్పి

ఏ అలజడీలేని ప్రశాంత రణరంగం

వీడ్కోలు తీసుకొంటూ చేస్తున్నా
కరచాలనం

యిలా అన్నాడు అరాచకవాది;
"మీ ఇంగ్లాండు కార్మికులకు చెప్పండి
ఈయుద్ధం మేం సృష్టించింది కాదనీ
మేం కోరి తెచ్చుకున్నదీ కాదనీ
మళ్ళీ ఎన్నడయినా ఫాసిస్టులు
బార్సిలోనా నగరాన్ని పాలించదలిస్తే
ధ్వంస నగరం శకటాల కింద
పడివుంటాయి మాశవాల గుట్టలని

*(రచనాకాలం: 1936)*

# యోధుడా! అంటూ కౌగిలించుకునే కవిత్వం

- దీపిక

**కొం**దరి కవిత్వం చదివితే మనసు ఉల్లాసంతో పరుగులు తీస్తుంది. కొందరి కవిత్వం చదవగానే పచ్చని పొలాల మీద, పిల్లగాలుల మీద, గలగల పారే సెలయేళ్ళమీద, ఆకుల సవ్వడికే బెంబేలెత్తి పోయి, పరుగెత్తే కుందేళ్ళ మీద, నల్లని ఆకాశం క్రింద తెల్లని మల్లెల్లా పరుగులు తీసే కొంగలపైన ప్రేమ పుట్టుకొస్తుంది. కొందరి కవిత్వం మట్టిమీద మమకారాన్ని పుట్టిన ఊరిమీద ప్రేమనూ, కన్నతల్లి మీద అనురాగాన్నీ కలుగజేస్తుంది. మానేపల్లి కవిత్వం చదవగానే ఉద్యమాల దరి చేరాలని పిస్తుంది. నిజంగా యోధుల్ని కౌగిలించుకోవాలనిపిస్తుంటుంది. అరణ్యంతో అల్లుక పోవాలని పిస్తుంటుంది.

మానేపల్లి చూపున్న కవి. అందుకే రాజ్యంలోని అసమానతల్ని చూడగలిగాడు. ఈతడు కలం యోధుడు. అందుకే నిర్భయంగా పోరాటానికి దిగాడు. వర్గ సరిహద్దుల్ని చెరిపేయటం కోసమే కలం పట్టినవాడు. కవి చేతిలో పెన్నూ, విప్లవకారుడి చేతిలోగన్నూ ఒక్కటేనని నిరూపించుకున్నాడు. జైళ్ళలో మ్రగ్గుతున్న వారికి ఉత్సాహాన్నీ, అస్థి పంజరాలకు కొత్త ఊపిరినీ, అభాగ్యులకు రేపటి మీద నమ్మకాన్నీ, దీనులకు కొండంత అండనూ కలిగిస్తుందీ కవిత్వం.

మరణం మొదలయ్యే ప్రస్థానంను, పిడికిళ్ళ అనంతశక్తినీ, రక్తపు చారికల చరిత్రనూ, నిద్రాణ వ్యవస్థపై అసహనాన్నీ, మేల్కొలిపే నినాదాల్ని, ఆయుధాలు పట్టే నేర్పునూ, వెన్నెముక వంగని తీరును, నిత్యం ఉచ్చరించే నినాదాల నాలుకలనూ, ఉద్యమం వైపే నడిచే పాదాల్నీ, పోరుకోసం వెనుదిరిగి చూడని నడకల్నీ చిక్కని ఫ్రేమ్‌లో బిగించి చూపించాడు కవి ఇందులో

ఆకాశం కప్పుకున్న ఎర్రని మేఘాలు, రక్తం బొట్టు పెట్టుకుని కదిలే వీరుడూ, గుండెను కాగడాలా వెలిగించుకుని కదిలే మనుషులూ, కొడవళ్ళు నూరుకునే రైతుకూలీలూ, నల్ల న్యాయాన్ని ఎదుర్కోడానికి సింహాలై గర్జించే వీరులూ, పుడమితల్లి చెరవిడిపించే వ్యక్తులూ, చదువుతో సంబంధం లేని వాళ్ళయినా తుపాకీలోని తూటాల్లా కదిలేవాళ్ళు, రణభేరీరవాల్ని ముంచేసే యోధులూ, కాలాన్ని కల్లోల పరిచే కెరటాల్లాంటి శూరులూ, భవిష్యత్తులోకి తప్ప గతంలోకి పరుగెత్త లేని ఆశాజీవులూ ఈ కవిత్వం నిండా కనిపిస్తారు. అణువణువునా మనకు కొత్త ఊపిరిలూదుతుంటారు.

నిజాన్ని, ఇజాల్ని చంపలేక అన్నది నిజమంత నిజం. నిజ్జంగా సముద్రాన్ని అరచేత్తో ఎవరు బంధించగలరు? గుప్పిటనిండా ఇసుకను తీసుకొని, సముద్రాన్ని చేతిలోకి తీసుకున్నామని చాటుకోవటం వెర్రితనం! లంకను అరిచేత్తో ఎత్తుకున్న హనుమంతుడి కథల్ని చెప్పటానికి వినే వాళ్ళెవరున్నారు? సముద్రం ముందు కుప్పిగంతులా? ఇప్పుడు సూర్యుడు అస్తమించినా, రేపు కొత్త కాంతులతో ఉదయిస్తాడు. అదే చెబుతాడు కవి:

"నువ్వు చంపిన వాళ్ళు
నిన్నే మీ చేయలేరని భ్రమనీకు

వాళ్ళు - ఏనాడో
బొందిలోంచి లేచి మందిలో కలిసి పోయారు" (నువ్వు చంపిన వాళ్ళు) అని.

ఈకవికి మనుషులంటే ప్రేమ. మనుషులంటే నమ్మకం. వాళ్ళు బురదలోంచి బువ్వను తీసిన వారూ, పేగుల్ని మాడ్చుకుని దారాలు తీసిన వారూ, కాళ్ళు కాల్చుకుని రోడ్లు నిర్మించిన వారూ, మాడు పగలకొట్టుకుని భవంతులు కట్టిన వారూ, తాజమహల్‌కు రాళ్ళెత్తిన వారూ, వాళ్ళు చదువుకున్న వాళ్ళు కావచ్చు. చదువు లేని వాళ్ళు కావచ్చు. అందుకే మనిషి మీద ఇంత నమ్మకాన్ని చూపిస్తాడు.

"వాడు చదువు రాని వాడు కావచ్చు
చమటోడ్చి కష్ట పడుతున్నాడు కదూ
వాడు కవిత్వం రాయలేక పోవచ్చు!
కలలు కంటూ కూచో కుండా
సరుకులు సృష్టిస్తున్నాడు కదూ
వాడు దైవభక్తుడు కాకపోవచ్చు
బస్తాల బరువును మోస్తున్నాడు కదూ
ఏది ఏమయినా
వాడు మౌలికంగా మనిషికదూ

మరి మనిషిని ప్రేమించకుండా ఎలా ఉంటాను"(మౌలికంగా మనిషిని ప్రేమిస్తాను) అని ఎంతో ప్రేమగా చెబుతున్నాడు. మనిషి మీద ఇంతటి అనిర్వచనీయమైన ప్రేమ ఉండటం ఈ కవి మనిషితనానికి నిదర్శనం.

మనిషి శక్తిని నిర్వచించాలంటే నిఘంటువుల్లో పదాలు దొరకవు ఆ శక్తి ఎక్కువమంది దృష్టిలో వ్యర్థమవుతుంటే నిస్పృహ చెందుతాడు కవి కొందరినైనా నిద్రాణ స్థితిలో నుంచి మేల్కొలపాలని దీక్ష. కలం పదును పెంచుతున్నాడు. అదును చూసి గుండెను తాకేలా పదాల్ని రువ్వుతున్నాడు. గురితప్పని నేర్పరి. మనుషులమీద మహా నమ్మకం కలవాడు అందుకే-

"మాసంకల్పం వజ్రసంకల్పమే, మా సంఖ్య క్రమక్రమంగా పెరుగుతుంది మా నమ్మకం వమ్ముకాదు, చరిత్ర మా వెంట ఉంది. మాది వచ్చే కాలం మా శత్రువుది పోయే కాలం. ఇది మా మహా సంకల్పం" (నడుస్తున్న చరిత్ర) అని ధీమాగా చెప్పగలుగుతున్నాడు.

మనిషికి మరణం అత్యంత సహజమైంది. మనిషి మరణానికి కారణాలెన్నో. మరణానికి భయపడేవాళ్ళు ఎందరో! మరణం పేరు చెప్పి మనుషుల్ని భయపెట్టేవారు ఎందరో! రోజూ ఛస్తూ బతికే వాళ్ళు ఎందరో! అనుక్షణం చావకుండా ధైర్యంగా బతికే క్షణాలు సగటు మనిషిలో కొన్నయినా ఉన్నాయా! అంటే అది సమాధానం లేని ప్రశ్నే అవుతుంది. మరణానికి భయపడటమెందుకు? అది అందరి సుఖం కోసమైతే వెరపెందుకు?

"మరణం కంటే ముఖ్యమైనది మరణమార్గం
నీమరణానికి మంది క్షేమం లక్ష్యమైతే
నీ దారిలో నీకు ఒంటరి తనం లేదు
అదే అసలైన సార్థక జననం" (మరణం రాగాలు) అని మరణానికి కొత్త నిర్వచనం చెబుతున్నాడు. కవి అంతేకాదు మనుషులకి వాళ్ళ చావు ఎలా సార్థకమవుతుందో కూడా చెబుతాడు.

"ముసలి తనంలోనూ, రోగాల్తోనో, రొడ్డు ప్రమాదంలోనో
చావటం కంటే
ప్రజల కోసం పోరాడుతూ నేల కొరగాలనే కోరుకుంటాను" (మరణం శరణం గచ్ఛామి)
అసలైన యోధుల అపురూపమైన కోరికలు ఇలానే ఉంటాయి.

ఆసుపత్రులు- ముఖ్యంగా ప్రభుత్వ ఆసుపత్రుల మృత్యుకుహోరాలూ, నరకకుపాలూ, అంతేకాదు. బ్రతికుండగానే నరకాన్ని ప్రత్యక్షింప జేయగల దృశ్యాసదృశ్యాలు అక్కడి సిబ్బందిని గురించి కవి మాటల్లో వినాల్సిందే!

"తినబోయే ముందు తృప్తిగా చూస్తున్నట్టు
ప్రశాంతంగా చూసే డాక్టర్ల దయగల చూపులు
పులి తినగా మిగిలిన మాంసం కోసం కాచు క్కూచున్న వరడులాగ
రెండూ కళ్ళు కనిపెట్టి చేసే కాంపౌండర్లు, నర్సులు" (హెబియస్ కార్పస్ పిటీషన్)

కవి ఆలోచన సమాజం చుట్టూ పరిభ్రమించాలి. కవికి మనిషే కేంద్ర బిందువు. మానవశ్రేయస్సే కవి ఆయుధం. కవి చూపు సమాజంలోని చెడువైపు పరుగెత్తుతుంది. అవినీతిని, స్వార్థాన్ని చీల్చి చెండాడుతుంది. నిజాల్ని నిర్భయంగా ప్రకటిస్తుంది. కర్తవ్యాన్ని ప్రభోధిస్తుంది. చేయవలసిన పనిని మనముందుంచుతుంది.

"కవి గుండె సెస్మోగ్రాఫ్
ఆకలి చావులకీ అణ్వాస్త్ర పరీక్షలకీ
రాజ్యాల పతనానికీ శాంతియుత ఆక్రమణలకీ ఆత్మహత్యలకీ - అడ్డూఆపులేని ఎన్‌కౌంటర్‌లకీ
స్పందిస్తుంది. నిరసన పత్రంపై సంతకాలు చేస్తుంది (కవి సమస్తం సమాజం)

స్త్రీని భోగ వస్తువుగా చూడటానికి తరతరాలుగా మగ సమాజం అలవాటు పడింది. తల్లిగా కూతురిగా, చెల్లిగా చూడల్సిన కళ్ళు అవయవాల వెంట పరుగులు తీస్తాయి. స్త్రీని దేవతగా పూజిస్తాం అనే ప్రతిజ్ఞ అబద్ధం. స్త్రీని అందాల రాశిగా, తాపాన్ని చల్లార్చే మాంసపు ముద్దగానే చూస్తారనేది నిజం.

"నియమాలూ, వరసలూ, వయసులూ అబద్ధం
నిరంతర వాంఛ ఒక్కటే పచ్చి నిజం
..........................................................................
..........................................................................
ఆకలితో చొంగ కార్చే కుక్క
ఒకే రంధిలో బతికే గుర్రం

మగ గురి: "(మృగ తృష్ణ) అనే మాటలు పురుష బుద్ధిపై ఎక్కు పెట్టిన బాణాలు. శత్రువును ఎదుర్కోటానికి ఒకే బాటన నడవాలి. ఒకే గమ్యం దిశగా సాగాలి. ఒకే చూపుతో పోరాడాలి. కులం. మతం శత్రువు మనల్ని పలుచన చేయటానికి గురిపెట్టిన తుపాకీలు. మనది ఒకే మార్గం అందుకే వర్గం సమిసి పోవటానికి ఏకతాటిపై పయనించాలి.

"శంబుకుడూ, ఏకలవ్యుడూ
గతం మేకులకు వేలాడుతున్న పటాలనుకుందాం
బాణం పట్టిన ఏకలవ్యుల బొటనవేళ్ళునరికి



# దేశం కోసమే

-సుదేరా

బొటనవేలి సిరాముద్రల్ని సేద్యం చేయడానికి
అర్భక 'అక్షరజ్యోతి'ని, కొడిగట్టించడం హర్షణీయమే!
మెతుకులు తినిపించే శ్రమశక్తిని ప్రేమించ లేని చోట
'శ్రమదానం' పత్రికల్లో పతాక చిత్రమవ్వడం రక్తికట్టే సన్నివేశమే!
గింజలు పండించే రైతులగొంతులో గంజిపారక పోతేనేమి?
ఆరుగాలం బూతులు పండించే సినిమాలకు రాయితీ లివ్వడం కళాపోషణార్థమే!
మెక్కిన 'హవాలా'లతో దేశం దివాలా తీస్తే మాత్రం,
నాలుగు సింహాసనమెక్కిన నరసింహానిది నిస్వార్థపథమే!
అన్నవస్త్రాలు కరువై ఆశలు అసువులు బాసే భూమిలో
అణ్వస్త్ర సాహసాలు ఆకలిదేహాల ఆత్మరక్షణార్థమే!
కారడవులు గొరిగిన తిరుపతి గుళ్ళయితేనేమి?
ఓజోను పొరలు చిరిగి ఆకాశం చింపిరి గొడుగైతేనేమి?
పారిశ్రామికీకరణం పర్యావరణ తోరణమే!
అశేష జీవన నదులతో జిహ్వానభిషేకించ లేకపోతే నేమి?
పంచవర్ష ప్రణాళికలన్నీ పాలకుల నాలుకలపై లుకలుకలాడే ప్రసంగపాఠాలే!
పాళీలనుంచీ ఖాళీ కాగితాలకు ప్రవహించే పరీక్షవాళికా ప్రయోగాలే !!
కొరుకుతున్న పరకలపై విదేశీ మరకలుంటే నేమి?
కప్పుకొనే బొంతలపై పరాయి సంతకాలుంటే నేమి?
'గాటె'ద్దులమయ్యాక మెడలో పడిన గొలుసులన్నీ స్వర్ణసమానమే!
స్టార్ ఛానళ్ళ నీలి కెరటాలలో కొట్టు కొచ్చేవి నగ్న దేహాలైతేనేమి?
లైంగిక విజ్ఞాన లోపంతో బాధపడే బడిపిల్లలకు 'పెద్ద'బాలశిక్షా!
విశ్వవేదికపై రొమ్ము విరుచుకొని దిగంబర కవాతు చేస్తేనేమి?
ఛాందసవాద సంప్రదాయానికి 'ప్రపంచ సుందరి' కిరీటం విప్లవ పురస్కారమే!
రొట్టెముక్కల్లేక రోగగ్రస్తమైన దేశంలో...
నీటి చుక్కల్లేక నోరెండి పాయిన నేలలో.....
చూపుడేలి సిరాచుక్కనో సారాచుక్కతో లెక్కించడం శ్లాఘనీయమే!!



---

ఈనాటి ద్రోహాచార్యుల్ని ఏం చేయాలి. (చివరికి) వారిని శిక్షించటం కోసం మనమందరం కలవాలని నినదిస్తాడు.

ఇందులో కవితలన్నీ వర్గ స్పృహతో రాసినవి. మనిషిని ప్రేమిస్తూ, ఉద్యమాల్నీ, విప్లవాన్నీ, కౌగలించుకోవాలని ప్రభోధించేవి. కవితలన్నీ బలమైన ప్రతీకలతో కూడుకున్నవి. శైలి నిరాడంబరమైనది. జన స్రవంతి నుంచి వచ్చిన భాష భావాలన్నీ ప్రగతినీ, పోరునూ, కోరుకునేవి. ఈసంపుటిని సాహితీ ప్రియులందరూ కౌగిలించుకుని (కొనుగోలు చేసుకుని) సొంతం చేసుకోవాల్సిందే.

**యోధుడా! కౌగలించుకోనీ మానేపల్లి (కవితా సంపుటి)**

పేజీలు 112; వెల 25రు.లు

ప్రతులకు : **ప్రగతి బుక్ హౌస్,**

మ్యూజియం రోడ్, విజయవాడ-520002;

**నవోదయ బుక్ హౌస్,** ఆర్య సమాజ్ మందిరం ఎదురుగా, హైదారాబాద్ - 500027,

# వివిధ ప్రజాకళారూపాల రచయిత అయ్యపు వెంకట కృష్ణయ్య

- కొత్తపల్లి రవిబాబు

జనసాహితి మిత్రులు, ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమ సైనికుడూ ఐన వెంకటకృష్ణయ్యగారు (అయ్యపు కృష్ణమూర్తి శాస్త్రి) తన 87వ ఏట 1996 జూన్ 20న స్వగ్రామమైన నందిగామ (మైలవరం దగ్గర) లో మరణించారు. వారి మరణానికి సంతాపం ప్రకటిస్తూ, వారి కుటుంబ సభ్యులకు సానుభూతిని జనసాహితి తెలియచేస్తోంది.

ఈ సందర్భంగా జనసాహితితో వారికి గల సన్నిహిత బాంధవ్యాన్ని పాఠకులతో పంచుకోవడం సముచితంగా వుంటుంది. జనసాహితి ఏర్పడిన తొలి సంవత్సరాలలో అయ్యపు వెంకట కృష్ణయ్యగారిని వారి వూరిళ్లో కలుసుకోడానికి విజయవాడ వన్‌టౌన్‌లో టెలిగ్రాఫ్ ఆఫీసు దగ్గర నుంచి బయలుదేరే ప్రైవేటు బస్సు ఎక్కి వెళ్ళాం. పాతతరం నాటి నిజాయితీ, మర్యాద మమ్మల్ని ముగ్ధులను చేశాయి. జనసాహితి కళాకారులను వారికి, వారి నాటక బృందానికి పరిచయం చేశాం. వారు రాసిన వివిధ ప్రజాకళారూపాల బాణీలు పాడి వినిపించారు. ప్రజా నాట్యమండలిలో వారి అనుభవాలు చెప్పారు. ఆ తరువాత రెండు మూడు సార్లు జనసాహితి కళాకారులు వారి వద్దకు వెళ్ళి బుర్రకథ బాణీలు, జంతర్‌పెట్టె, పాములవాడు బాణీలు నేర్చుకొని వచ్చారు. ప్రజానాట్యమండలి బృందాలకు వివిధ కళారుపాలను వారు రచించి ఇచ్చారు. వాటిలో ముఖ్యమైనవి, మహిళా ప్రభోధం, మనది భారతదేశం -(చెంచుకథ బాణీ); నాజీనైజాం (గేయనాటిక), స్వయంవరం - (గేయనాటిక), సంఘర్షణ (వీధినాటకం), స్మృతి చిహ్నం (విప్లవ కళాఖండాలు) ప్రచురించారు. బుడబుక్కల, బిచ్చగాడు, దేవరపెట్టె, జంతర్‌పెట్టె, ఓటుపాట (చెంచులు), ఎవడు దేశద్రోహి (ఫకీర్లు) మొదలగు కళారూపాలను వారు రచించారు. జనసాహితి బహుళ ప్రచారం చేసిన పాములవాడు, జంతర్ పెట్టె, వారి సూచనల కనుగుణంగా రూపొందించినవే. 'ప్రజాసాహితి' పత్రికలో 1982లో ప్రజాసంస్కృతి: ప్రజాకళారూపాలు' అనే శీర్షికను నవంబరు 1981 సంచికలో అయ్యపు వెంకటకృష్ణయ్యగారు రచించిన 'ఎవడు దేశద్రోహి' (ఫకీర్లు) కళారూపంతో ప్రారంభించాము. విజయవాడలో 'ప్రజాకళారూపాల' పై ప్రత్యేకంగా కేంద్రీకరించి నిర్వహించిన జనసాహితి ఐదవ రాష్ట్ర మహాసభలలో (1985 జూన్) వారు పాల్గొన్నారు.

అయితే ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ కై ఆనాటి పార్టీ సభ్యులకూ, ప్రజానాట్యమండలి కళాకారులకూ సరైన మార్గదర్శకత్వం ఇవ్వకుండా ' మీ బతుకులు మీరు బతకండి' అని చెప్పడంతో, అయ్యపు వెంకటకృష్ణయ్యగారు తన స్వగ్రామంలో పురోహితునిగా స్థిరపడ్డారు. ఒకవైపు పురోహిత్యం చేస్తూనే, మరొక వైపు ప్రజాసంస్కృతిని ప్రతిబింబించే రచనలు రాశారు. ప్రజాసాంస్కృతిక రంగంలో కృషిచేస్తున్న వారినెంతో ఆదరించారు. తన పుస్తకం 'స్మృతి చిహ్నం'లో కడలూరు జైలులో 11-10-1949 కాల్పులలో మరణించిన అనుమర్లపూడి సీతారామరావుకు జోహార్లు అర్పించారు. కోడూరులో వున్న అనుమర్లపూడి కళాసమితి కార్యక్రమాలకు చేయూత నిచ్చారు.

వారి రచనలలోని దీర్ఘ కవిత 'మనది భారతదేశమమ్మా' నుంచి సీతారామరాజు గురించి రాసిన పాదాలకు వారి జ్ఞాపకార్థం ఈ క్రింద ముద్రిస్తున్నాం.

# సీతారామరాజు (చెంచుకథ బాణీ)

-అయ్యపు వెంకటకృష్ణయ్య

మన సీతారామరాజమ్మా
మన్నెంపు వీరుడే తల్లీ
రవి క్రుంగనట్టి సామ్రాజ్యాధిపత్యాన్ని
అధికారమదమున్న ఆంగ్లప్రభుత్వాన్ని
గడగడా వణికించివాడూ
కంగారులో ముంచివాడూ
ఏకైక వీరుడయ్యాడూ
మనజాతి కొనమై
మనహక్కు కోసమై
జాతి స్వతంత్రతా సంరక్ష కోసమై
ఆత్మార్పణము చేసినాడూ
ఆంధ్రులను మేలుకొలిపాడూ
రైఫిల్ తుపాకులను రాళ్ళతో వంచించి
మరఫిరంగుల చెట్ల మాడుగా మంత్రించి
గొందునందుల్లోను కొండ గుట్టల్లోను
బానిసోద్యుగులకు మత్తు మందెక్కించి
భ్రమపెట్టి పడగొట్టినాడూ
దారులను మార్చివేశాడూ
స్టేషన్లు కొట్టివేశాడూ
సామాన్లు పట్టివేశాడూ
సాయుధ బలాలను విరాయుదుడెదిర్రాడు
తన గెరిల్లా యుద్ధ ధాటి
సామ్రాజ్యాన్ని - సామ్రాజ్య సైన్యాన్ని
శాసన ప్రతాపాన్ని, సామ్రాజ్యవాదాన్ని
స్వార్థపరత్వాన్ని-
గడ్డిపరకను జేసి కదిలించివేయగా
సాయుధ బలాలను
విరాయుధుడెదిర్చాడు

అతడు మన సోదరుడె తల్లీ!
మనకు తోబుట్టువేనమ్మా!
మంత్రగాడన్నారు - తంత్రగాడన్నారు
మాయమై పోరాడు - మహానీయుడన్నారు
చెట్టుపైనున్నాడు - గుట్టపైనున్నాడు
పట్టుకుందామంటె పట్టుబడడన్నారు
బారుఫిరంగులే పనిచేయవన్నారు
గజ గజా వణికి పొయ్యారు
కంగారు పొందిపోయ్యారు
సామ్రాజ్యవాదులే సంకటావస్థలో
గిజ గిజా తన్నుకున్నారు
మనకు కత్తుల్లేవు, మరఫిరంగుల్లేవు
మనమెట్లు చేయగల మనకూ
మనము దుర్బలుల మనబోకూ
యుద్ధమంటె భీతిగొనకూ
యోధ ధర్మమ్ము నేమరకూ
మంత్రముగ్ధుల చేసి మట్టుపెట్టేస్తుంది
స్వాతంత్ర్య కాంక్షతో చావునకు
తెగియించి
యుద్ధతంత్రము నేర్చి
యుద్ధభూమికి రమ్ము
బానిసత్వము రూపుమాపా!
ప్రజల శక్తిని జూపుదామూ -
చైనా గెరిల్లాల సాహసమ్మును జూచి
రష్యా గెరిల్లాల రణనీతి గుర్తించి
మన రామరాజు నేర్పిన విద్య సాయమున
ప్రతిఘటనతో ఎదురించుదామూ
ప్రజల శక్తిని జూపుదామూ

# ఒక్కచావుతో అంతం కానివాడికోసం

*- గోపరాజు నారాయణరావు*

లిప్తకోసారి కలుషిత ఊపిరులతో గుండె నిండుతూ వుంటే- అదెంత విషాద కరమో, అంతకుమించి లజ్జా భరితమో-అనుభవిస్తున్న వాడికే తెలుస్తుంది. అది బాధించే ఆరోగ్య సమస్య మాత్రమే కాదు. జీవించే హక్కును అతిహేయంగా ఎగతాళి చేసే మానవ హక్కుల సమస్య కూడా. నైజీరియాలో ఒగోని అనే చిన్నతెగ ఆరాటం, ఆ వెనుక రగులుతున్న పోరాటం వీటిచుట్టూనే కేంద్రీకృతమై వున్నాయి. ఈ పోరాటం గురించి దానికి ముందు నడిచి ఉరికంబాన్ని కౌగలించుకున్న ఉద్యమ నేత కెన్‌సారోవివా గురించి వివరించే చిన్న పుస్తకమే- 'కెన్‌సారోవివా కోసం'.

అణచివేత సాధారణంగా రాజకీయోద్యమాలకి, సాంఘికోద్యమాలకి ఎక్కువగా పరిమిత మవుతూ ఉంటుంది. అయితే పర్యావరణ కాలుష్యం గురించి ప్రశ్నించినందుకు మెడకు ఓ ఉచ్చు బిగించడమే అక్కడ జరిగిన కొత్త పరిణామం. సామ్రాజ్యవాద దేశాలే కాదు, అక్కడి ప్రైవేటు బహుళజాతి సంస్థలు సయితం ఎంతగా చెలరేగిపోగలవో రుచి చూపించిన సంఘటన కూడా ఇది. అందుకే ఒగోని నాయకుల ఉరితీత చూసి నిఖిల జగతి నివ్వెరపోయింది. సామ్రాజ్యవాదం, పర్యావరణ కాలుష్యం ఒక నగరానికో, దేశానికో, లేకుంటే ఒక్క ఖండానికే సంబంధించిన సమస్య కాకపోవడం ఈ స్పందనకు మరో ముఖ్యకారణం.

1995 నవంబర్ 10న తొమ్మండుగురు ఒగోని తెగనేతలను ఉరితీసిన సంగతి అందరికీ తెలిసినదే. ఇందులో ఎవరి విన్నపాలు అక్కడి సైనిక సర్కారుకు పట్టలేదు. ఒగోని తెగల నిలయమైన నైజర్ డెల్టాను 'షెల్' (రాయల్ డచ్ షెల్, బ్రిటన్) అనే బహుళజాతి సంస్థ చమురు తవ్వకాల పేరుతో కలుషితం చేయడాన్ని నిరసించినందుకు ఆ తొమ్మిది మందికీ ఈ దుర్గతి పట్టింది. ఇందులో కెన్‌సారో విఖ్యాత కవి. ఆయన అంతరంగం, ఒగోని తెగ అంతరంగం వివరించడానికి ఈ చిన్న పుస్తకంలో గొప్ప యత్నం కనిపిస్తుంది. ఒక తెగ ఉనికి, ఆ తెగ నివసించే నేలతల్లిమీద మమకారం, వాటిని కాపాడుకొనడానికి జరిగిన, జరుగుతున్న సంఘర్షణను ఈ పుస్తకంలో వ్యాసాలు, కవితలు ఆవిష్కరించాయి. ఒగోని ఉద్యమం, అబాచా సైనిక నియంతృత్వం, కెన్‌సారో అనువాద కవితలు, కవి అయిన ఉద్యమకారుడి మరణంపట్ల తెలుగుకవుల స్పందన ఇందులో పొందుపరిచారు.

'షెల్' సంస్థ చర్యలు, నైజీరియా సైనికనేతలు ఈ సంస్థతో కుమ్మక్కవడం, ఒగోని ప్రజానీకం తిరుగుబాట్లు, పరంపరగా జరుగుతున్న మరణ దండనలు వంటి పలు అంశాలతో కూడిన వ్యాసాన్ని 'కెన్‌సారోవివా అమరత్వం' పేరిట జనసాహితి సంస్థవారు ప్రచురించారు. కెన్‌సారో ఉరి తరువాత, అబాచా సైనిక ఏలుబడిని శపిస్తూ నోబెల్ బహుమతి గ్రహీత వోల్ సోయెంకా వ్యక్తం చేసిన అభిప్రాయాలను కూడా తెలుగులోకి అనువదించి రెండవ వ్యాసంగా ప్రచురించారు. నైజీరియా మట్టిని ప్రేమిస్తున్న నల్లజాతి అంతరంగాన్ని గొప్పగా వివరించిన

అనువాదమిది. ఆఫ్రికా జానపద గాథలు, నల్లజాతీయుల ఉపమానాలు దట్టించిన ఉద్వేగ భరిత రచన ఇది.

కోర్టులో కెన్‌సారో ఒక ప్రకటన చేశాడు. "సైనిక పాలనలో ఇటువంటి దుష్కృత్యాలు సహజమే అన్న వాదన/చేస్తూ; అన్యాయాన్ని, అణచివేతను ప్రతిఘటించడానికి బిడియపడే వారిలో నేనొకడిని కాదల్చుకోలేదు...." అన్నదే ఆ ప్రకటన సారాంశం. ఇది కూడా ఈ పుస్తకంలో కనిపిస్తుంది. కెన్‌సారో మరణానికి ముందు వ్రాసిన లేఖ, రచయితలు, జర్నలిస్టులపై సాగుతున్న నిర్బంధాల గురించి కూడ వ్యాసాలు వివరంగా ఇచ్చారు.

మానవతా విలువలు, సంస్కృతి, హక్కులు, నియంతృత్వం ముందు ఎంత నిస్సహాయంగా నిలబడి వున్నాయో ముఖం చరిచి చెప్పే వ్యాసం- 'మన మధ్యన ఉన్న హంతకులు'. 'ఈ దేశానికి (భారత దేశానికి) మిలటరీ పాలనే శరణ్యమని వదరే- మహానుభావులను నేతలుగా మోస్తున్న మన ప్రజలంతా ఈ వ్యాసం ఒక్కసారయినా చదవాలేమో అనిపిస్తుంది. కెన్‌సారో, ఆయన అనుచరుల ఉరి ఎంతపాశవికంగా జరిగిందో ఈ అనువాద వ్యాసంలో చెప్పారు. ఏమీ చెప్పకుండా, భార్యను, తండ్రిని చూడాలని వున్నదన్న సబబయిన అంతిమ కోర్కెను సయితం నిర్దాక్షిణ్యంగా నిరాకరించి మెడకు ఉరితాడు బిగించిన కర్కశత్వం గురించి, సైనిక పాలన ముచ్చట గురించి వ్యాసరచయిత వివరించారు. కెన్‌సారోకు తొలిసారి ఉచ్చు బిగియలేదు. ఉరికంబం నుంచి దించేశారు. కొద్దిసేపాగి మళ్ళీ ఉరితాడు బిగించారు. అలా నాలుగు పర్యాయాలు. మృత్యుముఖాన్ని చూపిస్తూ, దాని ఒడిలోకి చేరనివ్వకుండా ఆడిన నికృష్ట చెలగాటం- మానవ హక్కులని, మానవాళిని ఎంత అవహేళన చేసిందో- ఒక మనిషి మానసిక స్థితిని- చావబోతున్న ఒక కవి గుండెను అంతదారుణంగా హింసించిన సంఘటన చరిత్రలో బహుఅరుదుకావచ్చు. నాలుగయిదు సార్లు ఉరికంబం ఎక్కి దిగిన ఆ కొన్ని క్షణాలలో ఆయన వేదన, యాతన, క్షోభ ఊహించగలమా? ఇలాంటి రాక్షసచర్యతో నాగరికతను మానభంగం చేసినందుకు అబాచా సైనిక ప్రభుత్వం చింతించలేదు. సరికదా, ఈ దౌష్ట్యాన్ని ఎండగట్టినందుకు నెల్సన్‌మండేలాను సయితం వెక్కిరించడానికి సైనిక పాలకులు వెనుకాడలేదు.

అందుకేనేమో, ఒక కవితలో సారో ఏనాడో చెప్పుకున్నాడు-"వొక్కచావుతో అంతమయ్యే వాణ్ణి కాదునేను" అని 'నేనొక తుపాను' పేరుతో సారో వ్రాసిన ఆ కవితను అప్సర్ అనువదించగా ఆంధ్రభూమి ప్రచురించింది. దానినే ఈ పుస్తకంలో పునర్ముద్రించారు. సాగరం లాంటి సారో అంతరంగాన్ని అల్పాక్షరాలతో చెప్పిన చక్కని కవిత ఇది. "ఒగోని!ఒగోని!' ' పేరిట సారో జైలునుంచి వ్రాసిన కవితను నిర్మలానంద అనువదించి 'ప్రజాసాహితి'లో ప్రచురించారు. దీనినే ఇందులో పునర్ముద్రించారు.

"నీ పదాల అగ్గిరాళ్ళు
నీ జాతి జనులతో సంఘర్షిస్తే
తన ఆయిల్ బావులు భగ్గుమంటాయని
నీ ఊపిరి కాగడాని ఉరికొయ్యకు
వేలాడదీసింది"

అని 'మృత్యువును ధిక్కరించిన కవీ! జోహార్' అన్న కవితలో కవి పేర్కొనడం అద్భుతంగా వుంది. ప్రముఖ కవి వేగుంట మోహనప్రసాద్ వ్రాసిన మరోమంచి కవిత కూడా ఇందులో పునర్ముద్రించారు. సైనిక శాసనాన్ని మౌనంగా భరిస్తూ పోతే ఏమవుతుందో కోర్టులో తన

వాదనలో చెప్పడానికి కెన్‌సారో ప్రయత్నించాడు. ఆయన ప్రయత్నాన్ని సాగనివ్వలేదు. అదే భావాన్ని మన తెలుగు కవి గొప్పగా కవిత్వీకరించాడు.

"దుర్నీతుల చరిత్ర మడతల్లో
మానవ హక్కుల గూర్చి అడిగే మనిషి కి అక్కడ ఆనవాళ్ళు మిగలవు.
చీకటి మసుగుల్లో
వాదన లేని ఉరితాళ్ళు వేలాడతాయి"
(ఉదయానికి ఉరి) అంటాడు,

భూమి పుష్పించాలని కోర్కె నేరమై పోతే అధ్యాయంలో చరిత్ర నడుస్తోంది నీ సంస్కృతి, ఉనికి, నీహక్కు కాపాడుకోవాలన్న ఆర్తి నేరమవుతున్న యుగంలో మానవాళి మనుగడ సాగిస్తున్నదని ఈపుస్తకం హెచ్చరిస్తోంది. ఇది అందరూ చదవదగిన చక్కని విజ్ఞానదాయక సమాచారం.

చదివిన వారందరినీ ఒక కవితలోని ఈ రెండు పాదాలు వెంటాడతాయి.

"నిజంగానే జంతువులమధ్య
మనిషి మైనార్టీ అయిపోతున్నాడు".

అలా కాకూడదనే ఈ చిరు ప్రయత్నం.

కెన్‌సారోవివా కోసం

జన సాహితి ప్రచురణ: (ప్రతులకు : మైత్రీ బుక్ హౌస్
మసీదు వీధి, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ.520002) వెల 5.00 పుటలు:43.

---

# ఉత్తమ కథ

ఆలిండియా రేడియో వారు, "విమర్శకరంగం" అనే శీర్షికలో "ఉత్తమ కథ' ' గురించి ఫిబ్రవరి 12, 1953న శ్రీ పాలగుమ్మి పద్మరాజు, శ్రీ కొడవటిగంటి కుటుంబరావుల చర్చ ప్రసారం చేశారు. ఆ చర్చను మద్రాసు నుండి వెలువడిన "ఆంధ్రజ్యోతి"మాసపత్రిక, మార్చి, 1953 సంచికలో ప్రచురించింది. దానిని 'ప్రజాసాహితి', పాఠకుల కోసం యీ దిగువన ప్రచురిస్తున్నాము. - సంపాదకుడు.

కుటుంబరావు: ఏమండీ పద్మరాజుగారూ, మీరు కొత్త కథానిక ఏదైనా రాస్తున్నారా?

పద్మరాజు: లేదండి. ఈమధ్య కథానికల మీదకి మనస్సంతగా పోవడంలేదు.

కు : ఎందుచేత?

ప : ఒకకారణం, రాసిన కథలకి తగినంత ప్రచారం రాకపోవడమూ, రెండోది రాస్తున్నకొద్దీ దానిమీద మోజు తగ్గడమూను.

కు : కథలమీద మోజుతగ్గటం అన్నారే, నా అనుభవంలో కూడా కథ రాయాలంటే ముందుండినంత ఉత్సాహం ఇప్పుడు ఉండటంలేదు. దీనికి కారణం కథానిక యువకుల సొమ్మేమోనని నాకనిపిస్తున్నది. మీరేమంటారో....

ప : కేవలం వయస్సే కారణం అని అననుగాని మీరు చెప్పినది ఒప్పుకుంటాను. నేనొకప్పుడు పద్యాలూ, పాటలూ రాసేవాణ్ణి, ఇప్పుడసలు వాటిమీదకు మనస్సే పోదు. ఈ మనస్సులో వచ్చే మార్పు-అంటే మనిషి అభిరుచుల్లోను భావావేశంలోను, దృక్పథంలోనూ వచ్చేమార్పు- ముఖ్యకారణమనుకుంటాను, కొందరు ఎన్నేళ్లు వచ్చినా భావకవిత్వమూ చిన్నకథలూ రాయగలిగుండవచ్చు.

కు: ఈవిధంగా వార్థక్యంలో కూడా చిన్నతనంలోలాగే రాయటానికి ప్రయత్నించేవాళ్ళని ఒకరిద్దరిని చూస్తున్నాను; వారిలో మానసిక పరిణామం పూర్తిగా స్తంభించిపోయినట్లు వారి రచనలను చూస్తేనే తెలుస్తుంది. ఇంకొక విషయం కూడా ఉంది. నేను పదిహేను పదహారేళ్ల కిందట రాసిన కొన్ని కథలు తిరిగి చూసుకుంటే వట్టి పిండెల్లాగున్నాయి.

ప : మనం వెనకరాసిన కథల్ని ఇప్పుడు మనం విమర్శించుకోటంలో కొంచెం పొరపాటుందనుకుంటాను. ఏ వుత్సాహమైతే మనచేత ఆ కథలు రాయించిందో ఆ వుత్సాహంతో మనకిప్పుడు అంత ప్రమేయం లేకపోడం మీరన్నదానికి కారణం. కాని ఆ వుత్సాహానికి తప్పకుండా విలువ వుందని నేనంటాను.

కు : విలువ లేకేం, వుంటుంది. ఆ విలువను పాటించేవాళ్లు ఇప్పటికీ వాటిని చదివి సంతోషిస్తూనే ఉంటారు.,

ప : అదేలెండి. కథానిక యువకులచేతుల్లోనే బాగా నడుస్తుంది అని ఒప్పుకోవచ్చు. వయసు మీరినకొద్దీ లోకాన్ని గురించిన అనుభవం పెరిగి చెప్పదల్చుకున్న విషయం కథానికలో ఇమడ్చడం కష్టమవుతుందనుకుంటాను,

కు : అవును పద్మరాజుగారూ. నేనింకా కథానికలు రాస్తూనే వున్నానుగాని కథ ఆలోచించి నప్పుడల్లా ఆ పాత్రల వెనుకవుండే వాతావరణమూ మనస్తత్వమూ నా వూహలలో తెగపెరిగి పెద్దకథ రాయాలనే ప్రేరణ కలుగుతూంటుంది. ఒక్కొక్కప్పుడు బుద్ధి-నాటకం రాయాలన్నంత దాకా పోతుంది.

ప : నాటకాల విషయం వచ్చింది కనక చెపుతున్నాను. ఈమధ్య నేను రాసినవన్నీ నాటికలూ, నాటకాలూను. ఇంకో ధోరణిలోకి 'మనసు పోవటంలేదు. ఇందుకనే నాటకాంతం సాహిత్యం అని పెద్దలన్నారనుకుంటాను.

కు: మీ అనుభవం తెలియదు కాని నేను ఒకప్పుడు కథలో శిల్పం తప్ప మరేమీ చూసేవాణ్ని కాదు. అప్పటి నా ఉద్దేశంలో కథకి శిల్పం తప్ప ఇంకేమీ అవసరంలేదు. ఆ వైఖరి ఇప్పుడు మారిందనుకోండి.

ప : ఇప్పుడు మీ అభిప్రాయం, శిల్పం ప్రధానం కాదంటారా?

కు : అదికాదు. ఇప్పుడు కథాశిల్పం గురించి నాకు ఏవిధమైన జంకూలేదు. ఒకప్పుడు 'నా శిల్పం ఎంతబాగుంటుందో చూడండి' అన్నట్టుగా కథ రాసేవాణ్ణి, ఇప్పుడు కేవలం శిల్ప ప్రదర్శన కోసమే కథ రాయటం వట్టి దండుగగా కనిపిస్తోంది. కాని కథకి శిల్పం ఆయువుపట్టు అని మాత్రం ఆనాడే కాదు ఈనాడు కూడా ఒప్పుకుంటాను. కథలో శిల్పం లేకపోయినాక ఇంకెన్నున్నా దండుగే.

ప : నా బాధేవిటంటే ఈ విషయం గుర్తించిన కథారచయితలు చాలా తక్కువమంది కనిపిస్తున్నారు. ఇప్పుడు వచ్చే పత్రికల్లో కొన్ని వందల కథలు ప్రచురణ అవుతున్నాయి. దాదాపు ఒక్క కథలో కూడా చక్కని శిల్పం కనిపించడంలేదు. చెప్పదలుచుకున్న విషయం యెంత నిజమైనా, యెంత వాస్తవికమైనా కథానికలో శిల్పం కనపడకపోతే కథ కుంటుపడుతుంది.

కు : మీరు చెప్పేనదానికి ఒక ప్రబలమైన కారణం వుందనుకుంటాను. ఈ రోజుల ప్రభావాన్ని బట్టి కథకులు ముఖ్యంగా ఈనాటి యువకులు తమ కథల ద్వారా పరిస్థితులను మార్చాలని చూస్తున్నారేగాని, కథయొక్క వాస్తవికత శిల్పం మీద యెంత ఆధారపడి వుందో గ్రహించటంలేదు. ఒక ఉదాహరణ చెపుతాను. నేను వట్టి అభూతకల్పనలు కథలుగా రాసే రోజుల్లో అప్పటికే పేరుపడ్డ ఒక కథకుడు నా కథలు చదువుతున్నంతసేపూ అవి నిజమైనట్టే అనిపిస్తుందన్నాడు. ఇది కేవలం శిల్పపు ప్రభావమే అనటానికి నాకేమీ సందేహంలేదు. ఎంత వాస్తవికమైన పాత్రలూ, సంఘటనలూ తీసుకున్నా శిల్పలోపం చేత అవి అవాస్తవికంగా కనపడే అవకాశం లేకపోలేదు.

ప : పాత్రలూ సన్నివేశాలూ, వాస్తవికాలైనంతమాత్రాన్ని కథలో వాస్తవికంగా కనిపిస్తాయని ఋజువేంలేదు. మనం సృష్టించేది వాస్తవిక భ్రాంతిగాని వాస్తవంకాదు.

కు: అదీ నిజమే. ఇతివృత్తం నుంచి శిల్పాన్ని వేరుచేయటం సాధ్యంకాదని అనుకున్న తర్వాత, శిల్పంతో ప్రమేయంలేకుండా ఇతివృత్తంలోని ఒకపాత్రగాని ఒక సన్నివేశంగాని యదార్థం అనుకోవటంలో అర్థమేలేదు. నా ఉద్దేశంలో అనేకమంది రచయితలు శిల్పాన్ని పోగొట్టుకునేది జీవితంలో తాము గమనించిన కొన్ని విషయాలు తీసుకొని వాటికి బలాత్కారంగా తమ ప్రయోజనం జోడించటం వల్లనే అని.

ప : నాకు ఒక్కొక్కప్పుడనిపిస్తుందీ, అసలు యదార్థం అనేదే మనిషిమనిషికీ మారుతుందేమో

అని. ఒకే సన్నివేశం వుందనుకోండి, అది ముసలివాళ్లకో రకంగాను, చిన్నపిల్లలకి మరోరకంగాను కనిపిస్తుంది. ఒక చిన్నపిల్లవాడు ఒక చావును గురించికాని, తల్లిదండ్రుల మధ్య తనకి తెలియని కారణాల వల్ల వచ్చే ఘర్షణల్ని గురించికాని చెప్పడం ప్రారంభించినపుడు చాలా విచిత్రమైన భావన కలుగుతుంది. అలాగే కథాశిల్పంలో ఏ దృష్ట్యా సన్నివేశాన్నీ, పాత్రల్నీ చిత్రించాలో నిర్ణయించుకోడం చాలా ప్రధానమని నాకుతోస్తుంది.

కు : అందుకేం సందేహంలేదు. అక్కడే రచయిత యొక్క ఆశయం వ్యక్తమయేది కూడాను. మీరన్నట్టు జీవితంలోని ప్రతీసంఘటనా చూసేవారిని బట్టి వేరు వేరు అంతరార్థంతో కనిపిస్తుంది. ఈ వైవిధ్యాన్ని కధాకారుడు కాచి వడపోసి నిగ్గుతేల్చి ఏ దృక్పథం నుంచి ఆ సంఘటన లోని సత్యాన్ని లోకానికి వ్యక్తం చేయాలో నిర్ణయించుకోవాలి. నిర్ణయించుకున్న అనంతరం అతని కథ వివిధ మనస్తత్వాల వారికి ఒకే అనుభూతి నివ్వగలగాలి. ఇందులోనే కళ అనేదాని విశాల ప్రయోజనం ఇమిడి ఉంది.

ప: నేనిందాకా చెప్పిన ఉదాహరణ ఉందనుకోండి. ఒక కుర్రవాడి ద్వారా తల్లిదండ్రుల మధ్య జరిగే ఘర్షణ కథకుడు చిత్రిస్తున్నాడనుకోండి. అతని రచనని బట్టి ఒక కుర్రవాడి అనుభూతే కాకుండా అసలు ఆ తల్లిదండ్రుల మధ్య ఏర్పడిన సమస్య వారివారి మనస్తత్వాలు కూడా కథలో వ్యక్తం కావాలి. అవి కుర్రవాడి మాటల్లోనే వ్యక్తం కావాలి. ఇదే అన్నిటికంటే కష్టమైనపని.

కు: అవును.లేనిపక్షంలో కథ కాకుల్నికొట్టి గద్దలకి వేసినట్లవుతుంది. కథకుడి ప్రయోజనం కోసం కథలోని పాత్రలు బలి అవుతాయి. సాధారణంగా కథకుడి ప్రయోజనంలో సాంఘికమైన విలువ లోపించినపుడు ఇటువంటి రచనలు రాయటం జరుగుతుంది. దానిని సహృదయులు ఆదరింపలేరు. శిల్పం దృష్ట్యా కూడా అది మంచి రచన అనిపించుకోదు.

ప: ఉత్తమ కథలుగా ప్రఖ్యాతి పొందినవి చదివితే వాటిలో మనకి కొన్ని లక్షణాలు కనిపిస్తాయి. ఒకటి- విషయాన్ని సూక్ష్మంగాను, సూటిగాను చెప్పడం.. సామాన్యంగా కొత్తగా రచన ప్రారంభించే రచయితలు తమకు తోచినవన్నీ విధివిరామం లేకుండా వర్ణించేస్తుంటారు. ఈ సందర్భంలో చెహూవ్ గోర్కీకి ఇచ్చిన సలహా వొకటి జ్ఞాపకం వొస్తుంది నాకు. ప్రకృతి వర్ణన కథలోని పాత్రలతోటీ, సన్నివేశాలతోటీ సంబంధం లేకుండా ఉండడం పెద్ద లోపం అంటాడతను. గోర్కీ 'పడవ ప్రయాణం' అనే కథలో నదీ, చెట్లూ, చేమలూ, పడవా అందులోని వ్యక్తులూ, సూర్యాస్తమయం, చంద్రోదయం దీర్ఘంగా వర్ణించుకుంటూ వెళ్ళాడు. దాన్ని విమర్శిస్తూ చెహూవ్ అన్నాడు: "నువ్వు వెన్నెలనీ, వనాన్నీ వేరేవేరేగా వర్ణిస్తున్నావు; నువ్వు చెయ్యవలసినది వెన్నెలపడి వనం ఎక్కడెక్కడ వెలుగుతోందో, ఆ భాగాలు వర్ణిస్తేచాలు. అప్పుడు వెన్నెలనీ-వనాన్నే కాకుండా ఆ రెంటికీ ఉన్న అనుబంధాన్ని కూడా చెపుతున్నావన్నమాట; అటువంటివి ఏరుకోవడంలోనే కథాశిల్పం వుందీ"-అన్నాడు.

కు: శిల్పం చెడకుండా వర్ణనలు చెయ్యటంలో చలంగారు ఒక్కొక్కప్పుడు అద్భుతంగా రాస్తారు. కాని, అప్పుడప్పుడు ఆయన రచనలోనే వర్ణనలు పాత్రల మనస్థితిని మించి వెళ్ళిపోయినట్టు కనిపిస్తుంది. నామట్టుకు నేనెప్పుడూ నా కథలలో ప్రకృతిని పాత్రలకి అనువుగా ఉపయోగించుకోలేను. అందుచేత వర్ణనల జోలికిపోను.

ప: ఒక్క వర్ణనలేకాదు. ఇతివృత్తానికి సంబంధంలేని ఇతర విషయాల్ని కూడా కథల్లో ఇరికించడం జరుగుతోంది. కొద్దిమంది సిద్ధహస్తులు ఏ విషయాన్ని తీసుకొచ్చినా కథలో దానికి

స్థానం కల్పించగల్గుతారు. దానివల్ల విచిత్రమైన ప్రయోజనాల్ని కూడా సాధించగల్గుతారు. మొపాసా "నెక్‌లేస్" అనే కథలో కాలగతి సూచించడం కోసం ఫ్రాన్స్‌లో జరిగిన రాజకీయ పరిణామాలను కథతోబాటు ఏ సంబంధమూ లేకపోయినా వర్ణించి కథకు అద్భుతంగా ఉపయోగించుకున్నాడు.

కు: కాదా మరి? శిల్పంలో పొదుపూ ఉండాలి; ఉపజ్ఞా ఉండాలి. మన కథకుల్లో వేలూరి శివరామశాస్త్రి గారి రచన ఎంత బిగువుగా పొంకంగా ఉంటుందో చూడండి. మంచికథ ఏది చదివినా అందులో ఒక వ్యర్థపదం వున్నట్లుగాని వొకవాక్యం తేలిపోయినట్టుగాని వుండకూడదు. మరొకవిషయం ఏమిటంటే కథని ఏపాత్ర ద్వారా చెప్పాలో కథకుడికి తెలియాలని మీరిందాక అన్నారే, కొందరు కథకులు కథను స్వానుభవంగా చెప్పాలో మరొకరి అనుభవంగా చెప్పాలో కూడా నిర్ణయించుకోలేరు. నేను నేను అని కథ చెప్పుకుపోతూ ఇతర పాత్రలు అనుకున్న విషయాలు, రహస్యంగా చేసే పనులూ విపులంగా వర్ణిస్తారు.

ప: దీనికి కారణం రచనమీద కేంద్రీకరణ లేకపోవడం. చాలా కథలు ఎక్కడో మొదలు పెడతాయి ఎక్కడో అఖరవుతాయి. నాకు కథారచనకి ఒక ప్రధానసూత్రం వుందనిపిస్తుంది. కథా ప్రారంభం ఏమిటో, కథ ఎన్ని తిరుగుళ్ళు తిరిగినా-చివరిదాకా జ్ఞాపకం వుండాలి.

కు: ఈ సూత్రాన్ని అక్షరాలా పాటించినట్టయితే మంచి కథలకి కొన్నిటికి దెబ్బతగులుతుందేమో అని నా అనుమానం. అయినా ఆ సూత్రంలో ఒక సత్యం లేకపోలేదు. అదేవిటంటే ఒకే చిన్న కథను నాలుగైదు పాత్రల దృక్పథంనుంచి రచింపకూడదనేది. ఆ విధంగా దృక్పథాలు మార్చి కథ చెప్పటం పెద్ద కథలకీ నవలలకీ సరిపోతుంది. ఈ కారణంచేతనే పాత్రల పరిణామం చిన్న కథలో సాధ్యంకాదు. కాని కొందరు కథకులు కథాశిల్పం తెలుసుకోలేక చిన్నకథలోనే ఒక జీవిత కథని ఇమడ్చటానికి ప్రయత్నిస్తారు.

ప: నవలకీ కథానికకీ వున్న పెద్దభేదం ఇక్కడేనని అనుకుంటాను. ఒక పాత్ర జీవితకథని ఆమరణమూ వర్ణించినా చిన్నకథలో ఆ పాత్రలో ఏ ఒక్క విచిత్ర ప్రకృతినో స్పష్టం చేయడం మట్టుకు సాధ్యమవుతుంది. అంతేగాని, అతని మానసిక పరిణామం పూర్తిగా చిత్రించడానికి సాధ్యంకాదు.

కు: ఇంతకీ శిల్పానికీ రచనయొక్క ప్రయోజనానికీ అవినాభావం ఉన్నదని గ్రహించినట్టయితే, శిల్పంలో దోషాలన్నిటికీ మూలం కథ ప్రయోజనంలో దొరికిపోతుంది. కనీసం శిల్పం బాగుండి ప్రయోజనం పల్చబడవచ్చుగాని, శిల్పం పల్చబడి ప్రయోజనం విస్పష్టంకావడం సాధ్యంకాదు.

ప: రచయితకుండే ప్రయోజనాలకు ఆనాటి సమాజంలో ఉన్న పరిస్థితులకు చాలా దగ్గిర సంబంధం ఉండాలి. లేకపోతే ఆ రచన ఎందుకూ పనికిరాకుండాపోతుంది. తనకోసమే తను రాసుకుంటున్నాను, అనెవరైనా అన్నారంటే అది వట్టి బూటకం. ప్రతీరచయితా ఒక పాఠకుణ్ణి మనస్సులో పెట్టుకోకుండా అసలు రచన సాగించలేడు.

కు: అంతేగదా మరి. కథకుడు ఇతివృత్తం ఎన్నుకోవటంలోగాని దానికి తగిన శిల్పం అమర్చుకోవటంలోగాని పూర్తిగా ఏకాకిగా ఉంటాడు. ఆ కథ రచించటంలో అతను పెట్టుకునే ఆశయం ఒకటే. అతణ్ని సామాజికుణ్ణి చేస్తుంది. అతను ఒంటరిగా తన గదిలో కూర్చొని కథ రాస్తున్నప్పటికీ అతని మీద కథ చదవబోయే సహృదయుడి ప్రభావం అనుక్షణమూ వుంటుంది. ఈ సహృదయుణ్ణి స్పష్టంగా భావనచెయ్యలేని రచయిత తన ప్రయోజనాన్ని కూడా స్పష్టంగా చూడలేడని నిస్సంకోచంగా చెప్పవచ్చు.

ప: ఈ సహృదయత అనేది పైపైని ఉండే వాదాలలోగాని, విశ్వాసాల్లోగాని కనిపించే సామ్యంగాదు. అది మనిషి లోలోపల స్థిరంగావుండే మానవత్వానికి సంబంధించింది. అంచేత రచయిత స్పష్టంగా వ్యక్తపరచే సిద్ధాంతాలతో సానుభూతి లేనివారు కూడా అతని రచనలు చదివి ఆనందించడానికి సాధ్యమౌతోంది.

కు: అప్పుడేగదా కళద్వారా సంస్కారం అనేది సాధ్యపడేది? ప్రతి రచననీ దాన్ని ఆమోదించేవాళ్లే చదవాలంటే రచన చెయ్యటమే వృధా. ఇంతకన్న ప్రచార సాహిత్యమైనా మెరుగే.

ప: ప్రచార సాహిత్యానికి కళకీ ప్రధానమైన భేదం వుంది. సామాజిక సిద్ధాంతాలు జన బాహుళ్యానికి అనువర్తిస్తాయి. వ్యక్తుల దగ్గిరకి వచ్చేసరికి ఆ సిద్ధాంతాల నిజానిజాలు ఋజువుకావు; వ్యక్తి సమస్య సంఘసమస్య కొంత దూరదూరంగా వుంటాయి. వ్యక్తి దగ్గిరకి వచ్చేసరికి ప్రతీ సమస్యా ఒక నైతిక, ఆధ్యాత్మిక స్వరూపాన్ని పొందుతుంది. అంచేతే సాహిత్య స్వరూపంలో ముఖ్యంగా చిత్రణ జరిగేది ఈ వ్యక్తి యొక్క నైతిక సమస్యకి, సమాజ నియమాలకీ మధ్యవచ్చే ఘర్షణే. సిద్ధాంతాలకి మొత్తం సంఘం ముఖ్యం; కళకి వ్యక్తి ప్రధానం.

కు: అందుచేతనే రచయితకు సంఘ సమస్యల్ని గురించి వుండే విశ్వాసాలు నేరుగా రచనలో పెట్టడానికి అవకాశంలేదు. రచన యెప్పుడూ జీవితంనుంచి రావలసిందేగాని సిద్ధాంతాల నుంచి వచ్చే అవకాశంలేదు. కాకపోతే యేమిటంటే జీవితంలో మనుష్యులు ఎదుర్కొనే నైతిక ఆధ్యాత్మిక సమస్యలని తాను అర్థం చేసుకోటానికీ ఇతరులకి విస్పష్టంగా చెప్పటానికీ ఈ రచయిత విశ్వసించే సాంఘిక సిద్ధాంతాలు తోడ్పడవచ్చు. ఒక ఉదాహరణ చెప్తాను. ఒక రచయిత ధనికవాదం సంఘానికి ఉపకరించేదని నమ్ముతాడనుకోండి; ఆ రచయిత దృష్టి నుంచి ఒక నిరుద్యోగి ఆర్థిక సమస్య ఒక విధంగా గోచరిస్తుంది. ఈ నిరుద్యోగి అతని దృష్టికి సోమరిపోతుగానో అసమర్థుడుగానో గోచరిస్తాడు. ఆ రచయిత ఆ నిరుద్యోగిని ఆవిధంగానే చిత్రిస్తాడు కూడా. నిరుద్యోగానికి ప్రధాన కారణం పెట్టుబడిదారీ అని మరొక రచయిత నమ్ముతాడనుకోండి; అతని దృష్టికి నిరుద్యోగి సమస్యలు తీరనివిగాను, నిరంతరం పెరిగేవిగాను గోచరిస్తాయి. ఈ నిరుద్యోగులందరూ సంఘటితపడి పెట్టుబడిదారీని ప్రతిఘటిస్తే తప్ప ఈ సమస్య పరిష్కారమయ్యేది కాదన్నట్టు అతడికి గోచరిస్తుంది.

ప: ఏ సిద్ధాంతాల్లో నమ్మకం ఉన్నా సమాజం ఎలా మారాలని రచయిత నమ్ముతున్నా తను చిత్రించే జీవితంతో రచయితకు దగ్గర సంబంధమూ ఆ జీవితాన్ని గురించిన పరిపూర్ణమైన అనుభవమూ ఉండాలి. వట్టి సిద్ధాంతాలేగాని, రైతుల్ని గురించి, కూలీల్ని గురించీ ప్రత్యక్షమైన అనుభవంలేక ఈనాటి కథకుల్లో చాలా మంది మంచి కథలు రాయలేకపోతున్నారని నా నమ్మకం.

కు: చిత్రం ఏమిటంటే, ఈ రైతుల్తోను, కూలీల్తోను సన్నిహిత సంబంధం వున్నవాళ్ళు కూడా సానుభూతి వున్నవాళ్ళు కూడా ఒక్కొక్కప్పుడు సరియైన కథలు రాయలేకపోతున్నారు. వీరిని గురించి ఒకవైపు కొన్ని సిద్ధాంతాలున్నాయి. మరొకవైపు అనుభవం వున్నది. కాని, యీరెంటినీ సమన్వయించేశక్తి రచయితకుండటంలేదు. దానికి ప్రధాన కారణం యేమిటంటే- రచయితకుండే సానుభూతి వెంట, ఆ రైతు కూలీల జీవితంలోని సత్యాన్ని గ్రహించే శక్తి కూడా లేకపోవటం; ఈ రైతుకూలీ పొద్దస్తమానం చెమటోడుస్తున్నాడని, విచారిస్తాడు. ఎవరో ఒకరు చెమటోడ్చకుండా పొలాలు పండవనేది గ్రహించలేదు. చెమటోడ్చేవాడు ఎక్కడ అన్యాయానికి

గురవుతున్నాడో కనుక్కోలేడు. అన్యాయానికి గురిఅవుతున్నాడనిమాత్రం తెలుసుకుంటాడు. ఈరకం సానుభూతి సిద్ధాంతాలూ మంచి రచనలు చెయ్యటానికి చాలవు. మీరు చెప్పినట్టు తాను రచించే విషయాన్ని గురించి అనుభవంతోపాటు ఆ అనుభవం వెనక ఉండే జీవిత సత్యాన్ని తెలుసుకునే శక్తి కూడా ఉండాలి.

ప: ఒక్క చెమటోడ్చడమే రైతుకూలీ జీవితంలో ముఖ్యఘట్టమని రచయిత అనుకోడం దీనిక్కారణం. రైతుకూలీ ఒకవ్యక్తిగాకాక తన సిద్ధాంతంలో ఇమిడే ఒకభావంగా అతని కనిపిస్తాడు. అంతేకాదు. ఒక రైతుకూలీ తన భార్యాపిల్లలతో ఇరుగుపొరుగులతో పంచుకునే సుఖ దుఃఖాలని గురించి కూడా అతను తలపెట్టడు. అంచేతే ఒక అసంపూర్ణమైన చిత్రాన్ని ప్రదర్శించడం మాత్రమే జరుగుతుంది.

కు: అవునుగాని, ఒకటడుగుతాను చెప్పండి. కళగా ఏ రచనైనా అన్ని రకాల వ్యక్తులకీ ఒకేభావన, అనుభూతీ ఇవ్వాలనుకున్నాం గాని ప్రత్యక్షంగా చూసినట్టయితే ఇది సాధ్యం కానట్టు కనిపిస్తుంది. మీరేమంటారు?

ప: పాత్రలచిత్రణా సన్నివేశాల చిత్రణా విషయంలో చదివే అందరికీ కొంచెం ఇంచుమించుగా ఒకటే అనుభూతి కలుగుతుందని అనుకుంటాను. అయితే మీరన్నవాటి వెనకవున్న అంతరార్థం గురించిగాని, రచనలో వ్యక్తమయేసత్యాన్ని గురించిగాని భిన్నాభిప్రాయాలు తప్పకుండాకలుగుతాయి.

కు: అవునుగదా. అటువంటప్పుడు రచయిత ఏటువంటి జీవిత సత్యాన్ని చిత్రించాలన్న సమస్య కలగటంలేదా? సంఘంలో వుండే వివిధ వర్గాలలో ఏవర్గాన్ని తనకళకి సహృదయులుగా ఎంచుకోవాలో తేల్చుకోవాల్సిన అవసరం ఏర్పడుతోందిగదా.

ప: రచయిత సమాజంలో భాగమేకనుక అతని సానుభూతి కొంచెం ఇంచుమించుగా ఏదో ఒక వర్గంతో ముడిపడివుంటుంది. అంచేత ఆ వర్గాన్నే అతను మనస్సులో పెట్టుకుని రచన సాగించడం కూడా జరుగుతుంది. ఇంక మిగతా వర్గాలవారికి అతని రచనల్లో వున్న జీవితసాన్నిహిత్యం మట్టుకే నచ్చుతుంది. అతను చిత్రించే జీవిత సత్యంతో మట్టుకు సానుభూతి వుండదు.

కు: ఈ రచయిత తనవర్గాన్ని గురించే రాయాలని కూడా లేదు. అనేకమంది ప్రసిద్ధ కథకులు తమకు చాలాదూరంగావుండే వర్గాలని గురించికూడా కథలురాసి, ఆయా జీవితాల్లోని సత్యాన్ని ప్రదర్శింపగలిగారు. దీనికి టాల్‌స్టాయ్ మంచి ఉదాహరణ అనుకుంటాను.

ప: మీరన్న జీవితసత్యం టాల్‌స్టాయ్ తరచు తన రచనల్లో యిరికించే సిద్ధాంతాలుకావని నేననుకుంటాను. ఆ సత్యాలు అతని వ్యక్తిగతమైనవి. మీరన్న జీవితసత్యం ఇంతకంటే సూక్ష్మమైనదీ, సూత్రప్రాయంగా చెప్పడానికి వీల్లేనిదీ అనుకుంటాను.

కు: నిజమే. రచనలో రచయిత ప్రవేశపెట్టటానికి యత్నించే నీతివేరూ, రచనద్వారా బయటపడే జీవితసత్యం వేరూను. మనం అనేక పాతకథలు చదివి, వాటిలో కొత్తనీతులు చూడగలుగుతాం; కాని, నీతివుండే ప్రతికథలోనూ జీవితసత్యం ఉండవలసిన అవసరంలేదు. రచనలో జీవితసత్యం వ్యక్తం కావాలంటే రచయితకి జీవితం ఎంతబాగా తెలియాలో ఆ జీవితం తాలూకు పరమార్థం కూడా అంతబాగా తెలియాలి.

ప: నీతులూ, సిద్ధాంతాలూ, అలావుంచి రచనల్లోవ్యక్తమయే ఈ జీవితసత్యమే ఒక్కొక్కరికీ ఒక్కొక్కరకంగా అర్థమౌతుందని మనం ఇందాకా అనుకున్నాం. అయితే ఈ భిన్నసత్యాల్లో ఏదో ఒకటి నిజమైనదైయుండాలి. దాన్ని నిర్ధారణ చెయ్యడం ఎలాగ?

కు: సంఘంలో ప్రతివ్యక్తీ అనుక్షణమూ తనకు కావలసిన సత్యం గురించి అన్వేషిస్తాడు.

నిరుద్యోగి ఉద్యోగందొరికేచోట్లు చూస్తాడు. పారిశ్రామికుడు తనకిందవున్న ఉద్యోగుల సంఖ్య తగ్గించేందుకు మార్గాలు చూస్తాడు. ఇటువంటి సత్యాలు ఆయావ్యక్తుల జీవితాలను ముందుకు తీసుకుపోతాయనటానికి సందేహంలేదు. కాని, ఇవి సామాజిక జీవితాన్ని ముందుకు తీసుకుపోయే సత్యాలుమాత్రం కావు; ఒకేదేశంలో ఒక మనిషి నుంచి ఇంకోమనిషి లాభం పొందినపుడు దేశంలో వున్న డబ్బు పెరగనట్టు, జీవితసత్యం అయినపుడు దానికి రెండు దాఖలాలుండాలి. ఒకటేమిటంటే, సత్యం అనేది అన్నివర్గాలవారికీ నిర్వివాదంగా కనపడాలి. రెండవది ఆ సత్యం తెలుసుకోవటంవల్ల ప్రతివ్యక్తికీ సమాజస్వరూపాన్ని గురించిన జ్ఞానం విధిగా అభివృద్ధి చెందాలి.

ప: కథల్లో సామాజికమైన సమస్యలు చిత్రించినట్టయితే ఆ జీవిత సత్యం అనేది కొంతవరకు గుర్తుపట్టడానికి అవకాశం వుంటుంది. కాని, సాహిత్యంలో గొప్పస్థానం సంపాదించుకున్న కొద్దిమంది రచనల్లో స్పష్టమైన ప్రయోజనంకాని, ఒక జీవితసత్యంకాని ఎత్తిచూపడానికి కనపడదు. వాటిసాహిత్య ప్రయోజనాన్ని ఏలాగ అంచనా వెయ్యడం.

కు: ఇందులో ఒకటుందనుకుంటాను. సామాజిక సమస్యనెత్తుకున్నప్పుడు ఆ సమస్యను కథకుడు సరిగా చిత్రిస్తున్నాడో తారుమారు చేస్తున్నాడో ప్రజలకి సులభంగా తెలిసిపోతుంది. అంతేగాక ఆ సమస్య ఎట్లా పరిష్కారం కావాలనే విషయం జనబాహుళ్యానికి తెలిసివుంటుంది. కాని, స్పష్టమైన ప్రయోజనంకాని, జీవితసత్యంకాని ఎత్తిచూపడానికి కనపడని గొప్పరచనల్లో రెండురకాలుంటాయని నా అనుమానం. ఒకటి, రచయిత ప్రతిభావంతుడై ఉండి కూడా, తానే సాంఘికసత్యాన్ని సరిగా అవగాహన చేసుకోకపోవటం. నిజానికి వాస్తవజీవితాన్ని గురించి వాస్తవంగా రాయటానికి ఇది అడ్డుకాదు. ఇందుకు గొప్ప ఉదాహరణ జేమ్స్ జోయ్స్ రాసిన యులిసిస్ నవల. ఇకరెండవది రచయితకి ఒక ప్రయోజనం వుండి కూడా తాను చెప్పదలచుకున్న జీవితసత్యాన్ని నిగ్గుతియ్యటానికి బదులు రచనలో అంతటా పరిచేస్తాడు. ఇటువంటి రచనలో ఒక సాంఘికసమస్య వుండదు. కాని, సంఘం యొక్క ప్రతిబింబం సజీవంగా రచన అంతటా గోచరిస్తూంటుంది. దీనికి మంచి ఉదాహరణ గోర్కీ నాటకం: "లోవర్ డెప్త్స్", అంతర్జాతీయ కథానిక పోటీలో బహుమానం పొందిన మీ 'గాలివాన' తీసుకోండి. ఇందులో ప్రత్యేకించి ఒక సాంఘిక సమస్యలేదు. కాని ఆ కథ అంతటా వాస్తవ మనస్తత్వ చిత్రణం గోచరిస్తుంది. అందులో కనిపించే సాంఘిక సత్యం ఏమిటీ అంటే ఒక వాక్యంలో చెప్పటం సాధ్యంకాదు. కాని, అటువంటి సాంఘికసత్యం దానిలో తప్పకుండా ఉంది.

ప: అంటే ఏ రచనకైనా బలాన్ని చేకూర్చేది ఈ జీవిత సత్యమే అనాలి. ఇది మానవత్వమంత విశాలమైందికూడాను. అంటే కళ నిష్ప్రయోజనమైంది కాదనీ, దానికి జీవితంలో, మనం నివసించే సమాజంలో దగ్గర సంబంధం వుండడమేకాక జీవితాన్ని అర్థం చేసికోడానికి ఒకదృష్టి పథాన్ని కూడా కలిగించాలి.

కు: అంతే. మీకభ్యంతరం లేకపోయినట్టయితే యథార్థమయిన కళ 'జీవితం యొక్క జీవితం' అంటాను.

ప: మనం కథానికలతో ప్రారంభించి చాలా విశాలమైన సాహిత్య సమాలోచనలోపడ్డాం. అయితే ఉత్తమ రచనలకి అన్నిటికీ ఉండవలసిన లక్షణాలు సామాన్యంగా ఒకటేగనక ఈ సమాలోచన తప్పదను కుంటాను. మన చర్చలో తేలిన అంశాల్లో గుర్తుంచుకో వలసినవి; ఇవి అని నాకుతోస్తుంది. ఉత్తమకథకి మొట్టమొదట ఉండవలసింది శిల్పం. రెండోది వాస్తవికత. మూడోది జీవిత సత్యానికి సంబంధించిన ప్రయోజనం. ☆

సీరియల్



# చెదిరిన సమాజం

(ఆఫ్రికన్ నవల)

## చినువ అచెబే

| ఆంగ్ల మూలం | అనువాదం |
| --- | --- |
| THINGS FALL APART | కొలసాని సాంబశివరావు |

(జూన్ సంచిక తరువాయి)

## పన్నెండో అధ్యాయం

ఆ మరునాడు ఓకోన్క్వో స్నేహితుడు ఒబైరికా తన కూతురి 'యురి' (పెళ్ళికూతురికి ఓలి చెల్లించగానే, పెళ్ళిలో భాగంగా జరిగే వేడుక) జరుపుతుండటం వల్ల వూరంతా ఉత్సవ వాతావరణంతో నిండిపోయింది. ఆ రోజు పెళ్ళికూతురికి ఇవ్వాల్సిన ఓలిలో అత్యధికభాగం ఇప్పటికే చెల్లించిన పెళ్ళికొడుకు, పెళ్ళికూతురి తలిదండ్రులకూ, ఆమె దగ్గరి బంధువులకు మాత్రమే కాక, 'ఉమున్నా' అనబడే విస్తృత బంధువర్గానికి కూడా తాటికల్లు పట్టుకొస్తారు. ఈ వేడుకకు మగాళ్ళనీ, ఆడాళ్ళనీ, పిల్లల్నీ - అందర్నీ పిలుస్తారు. కాని నిజానికి ఇది ఆడవాళ్ళ వేడుక. అందులో ప్రధానపాత్ర వహించేది పెళ్ళికూతురూ, ఆమె తల్లీ.

ఆ రోజు తెల్లవారగానే, త్వరత్వరగా అల్పాహార కార్యక్రమం పూర్తిచేసుకొని, కష్టమే అయినా, వూరందరికీ భోజనాలు పెట్టే ఆనందదాయకమైన పనిలో పెళ్ళికూతురి తల్లికి సాయపడటానికి ఆడవాళ్ళూ, పిల్లలూ ఒబైరికా ఇంటి ఆవరణకు చేరారు.

ఇతర కుటుంబాల లాగానే ఓకోన్క్వో కుటుంబం కూడా కదిలింది. న్వోయే వాళ్ళమ్మ, ఓకోన్క్వో చిన్న భార్య, తమ పిల్లలందర్నీ తీసుకుని ఒబైరికా ఇంటికి వెళ్ళడానికి తయారుగా వున్నారు. ఒబైరికా భార్యకు బహుమతిగా ఇవ్వడానికి న్వోయే వాళ్ళమ్మ ఒక బుట్టనిండా కోకో యామ్‌లు, వేయించిన ఉప్పు చేపముక్కలు తీసుకువెళ్తోంది. ఓకోన్క్వో చిన్నభార్య ఒజయునొ కూడా ఒక బుట్టనిండా అరటిపండ్లు, కోకో యామ్‌లు, ఒకచిన్న కుండనిండా వంటనూనె పట్టుకెళ్తోంది. వాళ్ళ పిల్లలు నీళ్ళకడవలు తీసుకెళ్తున్నారు.

నిస్సత్తువ కల్గించిన గతరాత్రి అనుభవంతో ఎక్వెఫి బాగా అలసిపోయి, నిద్రలేక బద్దకంగా వుంది. అదీకాక, తనూ, ఓకోన్క్వో - ఇద్దరూ ఇంటికి చేరికూడా ఎక్కువసేపు కాలేదు. నిద్రపోతున్న ఎజన్మాను వీపుమీద వేసుకుని, ఆ పూజారిణి, ఇరుకుగావున్న పూజాపీఠం నుండి పాములాగా పొట్టపై పాకి బయటకు వచ్చింది. ఆమె ఓకోన్క్వో, ఎక్వెఫిలను పట్టించుకోలేదు. గుహద్వారం వద్ద వారిని చూసి ఏ మాత్రం ఆశ్చర్యం ప్రకటించలేదు. ఆమె సూటిగా, తన దృష్టిని

కేంద్రీకరించి గ్రామంలోకి వెళ్ళింది. ఆమెకు కొంత దూరంగా ఓకోన్క్వో, ఎక్వెఫిలు ఆమెను అనుసరించారు. ఆమె తన ఇంటికి పోతుందనుకున్నారు వాళ్ళు. కాని ఆమె ఓకోన్క్వో ఇంటికి వెళ్ళి, అతని 'ఓబి' దాటి, ఎక్వెఫి గుడిసెలోని పడకగదిలోకి వెళ్ళింది. ఎజిన్మాను జాగ్రత్తగా పక్కమీద పడుకోబెట్టి, ఎవరితోనూ ఏమీ మాట్లాడకుండా వెళ్ళిపోయింది.

అందరూ లేచినా, ఎజిన్మా మాత్రం ఇంకా నిద్రపోతూనే వుంది. తను రావడం ఆలస్యమౌతుందని ఒబైరికా భార్యతో చెప్పమని, ఎక్వెఫి ఒజియుగోతో చెప్పింది. తనుకూడా ఒక బుట్టనిండా కోకోయామ్‌లు, చేపలు సిద్ధంగా వుంచుకుంది. కాని ఆమె ఎజిన్మా నిద్ర లేచేవరకు ఆగాలి!

"నీకుకూడా కొంత నిద్ర అవుసరం. చాల అలసిపోయినట్లున్నావు" అంది న్వోయే వాళ్ళమ్మ, ఒజియుగో.

వాళ్ళలా మాట్లాడుకుంటుండగా, ఎజిన్మా కళ్ళునులుముకుంటూ, తన బక్క శరీరాన్ని విరుచుకుంటూ, గుడిసెలోంచి బయటకు వచ్చింది. అక్కడ పిల్లలంతా కడవలు పట్టుకొని వుండటం చూడగానే, ఆమెకు వాళ్ళంతా ఒబైరికా భార్యకి నీళ్ళు తెచ్చిపోయడానికి వెళ్తున్నారని గుర్తువచ్చింది. వెంటనే తనుకూడా గుడిసెలోకి వెళ్ళి తన కడవ పట్టుకొచ్చింది.

"నీకు నిద్ర సరిపోయిందా? అని తల్లి అడిగింది.

"ఆ, మనం కూడా పోదాం పద" అంది ఎజిన్మా.

"పొద్దున్నే నీవు ఏమీ తినకుండా మాత్రం మనం వెళ్ళం" అంది ఎక్వెఫి. ఆమె గుడిసెలోకి వెళ్ళి. గతరాత్రి కాచిన శాకాహార పులుసును వేడి చేయడం ప్రారంభించింది.

"అయితే మేం వెళ్తున్నాం. నీవు ఆలస్యంగా వస్తున్నావనీ ఒబైరికా భార్యకు చెప్తాంలే." అంది న్వోయే వాళ్ళమ్మ. అలా చెప్పి వాళ్ళందరూ - న్వోయే వాళ్ళమ్మ తన నలుగురి పిల్లలతోనూ, ఒజియుగొ తన ఇద్దరు పిల్లలతోనూ - ఒబైరికా భార్యకు సాయం చేయడానికి వెళ్ళారు.

ఓకోన్క్వో 'ఓబి' దాటి వాళ్ళంతా పోతుంటే, ఓకోన్క్వో అడిగాడు - " నా సాయంకాలం భోజనం ఎవరు వండిపెడ్తారు?".

"మళ్ళీ వచ్చి నేను చేస్తాను" అంది ఒజియుగొ.

ఓ 'న్క్వోకు కూడా అలసటతో నిద్రమత్తు ఆవరించింది. గత రాత్రి అసలు అతను నిద్రపోలేదు. ఈ విషయం ఇతరులెవరికీ తెలియదు. అతడు చాల ఆదుర్దాపడ్డాడు కాని ఎక్కడా బయటపడలేదు. గతరాత్రి ఎక్వెఫి, పూజారిణిని అనుసరించి వెళ్ళిన తర్వాత, మగవాడిగా చేయాల్సిన ఆలస్యం చేసి, ఓకోన్క్వో తన పెద్దకత్తి చేతబట్టుకొని, పూజా స్థలానికి వాళ్ళు చేరివుంటారని వూహించి, అక్కడకు వెళ్ళాడు. ఊళ్ళన్నీ చుట్టిరావడానికి పూజారిణి సంకల్పించుకుందన్న సంగతి అక్కడకు వెళ్ళిన తర్వాత అతనికి అర్థమైంది. వెంటనే ఇంటికి వచ్చి వాళ్ళకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. ఎంత సేపటికి వాళ్ళు తిరిగి రాకపోవడంతో అతను తిరిగి మళ్ళీ పూజాస్థలానికి వెళ్ళాడు. కాని అక్కడ కొండలు, గుహల్లో శ్మశాన ప్రశాంతత ఆవరించి వుంది. అట్లా అతను నాలుగుసార్లు తిరిగాక కానీ ఎక్వెఫి అతనికి కనిపించలేదు. దానితో తనలో తాను కలత చెందాడు.

★ ★ ★

ఒబైరికా ఇంటి ఆవరణ అంతా పగిలిన చీమల పుట్టలాగా హడావుడిగా వుం. ఎండి గట్టిగా తయారైన మూడు మట్టి పెళ్ళలను కలిపి, తాత్కాలికంగా పొయ్యిలు ఎక్కడ చక్కు దొరికితే అక్కడ ఏర్పాటు చేసుకున్నారు. పొయ్యిలు రాజేసారు. వాటి మీదకు వంట పాత్రలు ఎక్కాయి. దిగాయి. వందలకొలది చెక్కరోళ్ళల్లో ఫూఫూ ని దంచారు. కొందరు ఆడవాళ్ళు యామ్‌లూ, 'కసావా' వండారు. మరికొందరు ఆకులతో పులుసు చేశారు. యువకులు ఫూఫూ ని దంచి ఇచ్చారు. లేదా వంట చెరకుకోసం దుంగలని పగలేసి కట్టెలు సరఫరా చేశారు. పిల్లలు నీటికోసం అంతులేనన్ని సార్లు సెలయేటికి అటూ ఇటూ తిరిగారు.

ముగ్గురు యువకులు, ఒబైరికాకు రెండు మేకలను నరకడంలో సాయపడ్డారు. వాటితో పులుసు వండారు. అవి చాల బాగ బలిసిన మేకలు, కాని అంతకంటే బాగా తెగ బలిసిన మేకను కంపౌండ్ గోడదగ్గర పగ్గంతో కట్టేశారు. అది ఒక చిన్న ఆవు అంతుంది. ఒబైరికా తన బంధువులలో ఒకడిని ఆ మేకను కొనడానికి ఏకంగా ఉమ్యుయికెఅంతుకి పంపించాడు. దీనిని సజీవంగా తన వియ్యాల వారికి ఒబైరికా కానుకగా ఇస్తాడు.

ఈ మేకను కొనడానికి వెళ్ళి వచ్చిన యువకుడు ఇలా అన్నాడు-"ఉమ్యుయికె సంత అద్భుతమైనది, అబ్బ - ఎంత జనమనుకున్నారూ - ఇసుకవేస్తే రాలనంత మందినుకో."

ఇది విన్న ఒబైరికా వివరించాడు. "అదంతా గొప్ప మంత్రపు మందు ప్రభావం. ఉయ్యుయికె ప్రజలు తమ మార్కెట్ బాగా అభివృద్ధి పొందాలనీ, వారి ఇరుగుపొరుగు వారి మార్కెట్లు పడిపోవాలని కోరుకుంటారు. కనుక వారు ఒక శక్తివంతమైన మంత్రమందును తయారుచేశారు. ప్రతి సంతరోజు, తొలికోడికూతకు ముందుగానే, ఈ మంత్రపు మందు విసనకర్రపట్టుకొన్న ముసలమ్మరూపంలో సంతలో నుంచొని వుంటుంది. ఈ మాయవిసన కర్రతో ఆమె ఇరుగు పొరుగు తెగల వారందరినీ ఈ సంతకు పిలుస్తుంది. ఎదురుగా వున్నవారినీ, వెనుకవున్నవారిని, కుడిఎడమల ప్రక్కన వున్నవారినీ-అందరినీ తన మాయవిసనకర్రతో సంతకు వచ్చేట్లుచేస్తుంది.

"కనుక అందరూ వస్తారు-వారిలో మర్యాదస్తులుంటారు. దొంగలుంటారు. సంతలో తిరుగుతుంటే ఆ దొంగలు నీవంటి మీద చొక్కా కూడా దొంగతనం చేసి పట్టుకుపోతారు.

"అవును-నిజమే" . "ఒబైరికా ఒప్పుకున్నాడు"అందుకే అనుక్షణం జాగ్రత్తగా వుండమని నేను న్వాన్‌క్వోని హెచ్చరించాను. ఒకప్పుడు ఒకాయన తన మేకను అమ్మాలని ఆ సంతకు వెళ్ళాడు. మేకకు కట్టిన తాడును తన చేతికి గట్టిగా కట్టుకున్నాడు. కాని సంతలో నడుస్తుంటే తనను జనం పిచ్చివాడిలాగా చూస్తున్నారని గమనించాడు. వెనక్కి తిరిగి చూసుకుంటేగాని అసలు సంగతి అర్థంకాలేదు. ఎందుకంటే తను పట్టుకున్న తాడు చివర మేకకు బదులు ఒక పెద్ద కొయ్యదుంగ వుంది."

"ఇటువంటి పనిని ఆ దొంగ తనంతటతానే ఒక్కడే చేయగలడనుకుంటున్నావా?" అడిగాడు న్వాన్‌క్వో.

"లేదు వాళ్ళు మాయమంత్రాల మందు వాడుతారు" జవాబిచ్చాడు ఒబైరికా.

మేకల తలలు నరికి వాటి నెత్తురును ఒక బొచ్చెలో పట్టారు. మేకల శరీరంపై వుండే బొచ్చును కాల్చివేయడానికి వాటిని మంటలపైన వేలాడదీశారు. బొచ్చుమాడుతున్న వాసన, వంట వాసనలతో కలిసిపోయింది. తర్వాత వాటిని శుభ్రంగా కడిగి ముక్కలు ముక్కలుగా తరిగారు. ఆ తర్వాత వాటిని పులుసు కాయడానికి ఆడవాళ్ళకు అందించారు.

చీమలపుట్ట దగ్గర సందడి సాఫీగా కొనసాగుతుండగా, అకస్మాత్తుగా ఒక అంతరాయం

...క్కడో దూరం నుంచి వినబడిన ఒక కేక ఆ అంతరాయాన్ని కల్గించింది. "ఒజిఒడు ...చే యాజీ..వూ..వూ! (ఈగలను తోలడానికి తోకను ఉపయోగించేజంతువు) ఆ కేక విని స్త్రీలందరూ తాము చేస్తున్న పనిని వదిలేసి, కేకవినిపిస్తున్న వైపుకు పరుగెత్తారు.

"పొయ్యిమీద వంట వదిలేసి అలా అందరం పోడానికి వీల్లేదు. ముగ్గురు నలుగురైనా ఇక్కడ వుండాలి". అని పూజారిణి చీలో అరిచింది.

"అవును-నిజమే. ముగ్గురు, నలుగురు ఇక్కడ వుండాలి"అంది మరొకావిడ.

ఉడుకుతున్న వంటలని చూడటానికి ఐదుగురు ఆడాళ్ళు ఆగిపోయారు. ఇక మిగిలిన వారంతా కట్టకుండా వదిలివేయబడిన ఆవును చూడటానికి ఎగబడ్డారు. వాళ్ళు దానిని చూసేటప్పటికీ, దాన్ని యజమాని దగ్గరికి తోలారు. ఇరుగు పొరుగువారి పొలాల్లోకి ఆవులను వదిలిన యజమానులపై గ్రామం వేసే భారీ జుల్మానాను, ఆ ఆవు యజమాని వెంటనే కట్టి వేశాడు. ఆడవాళ్ళు ఆ జుల్మానాను నిష్కర్షగా వసూలు చేసిన తర్వాత, కేకలు పెట్టిన సమయంలో ఎవరైనా స్త్రీ బయటకు రాకుండా మానేసిందా అని తమను తాము సోదా చేసుకున్నారు.

"మగ్బొగో ఏది?"ఒకావిడ అడిగింది.

"ఆవిడ జ్వరంతో పడుకుని వుంది"- చెప్పింది ఆమె ఇంటి ప్రక్కావిడ,

"కేకవిని బయటకు రాని ఒకే ఒకామె ఉడెన్క్వో. ఆవిడకు ఇరవై ఎనిమిది రోజుల పసిగుడ్డు వుంది"అంది మరొకావిడ.

ఒబైరికా భార్య తమని వంటలో సాయపడమని అడగని ఆడవాళ్ళు అంతా వారివారి ఇళ్ళకు మళ్ళారు. మిగిలిన వాళ్ళు గుంపుగా ఒబైరికా ఇంటి ఆవరణలోకి తిరిగి వచ్చారు.

వంటకోసం అక్కడే వుండిపోయిన ఒకావిడ అడిగింది "ఎవరిది ఆ ఆవు?"

"మా ఆయనదే. ఎవరో పిల్లలు పశువులకొట్టం తలుపు తీశాడు"అంది ఎజెలాగ్బో.

★ ★ ★

ఒబైరికా వియ్యాలవారి దగ్గరనుంచి మధ్యాహ్నం కాకముందే తొలివిడత రెండుకుండలకల్లు దిగింది. వంట చేసేటప్పుడు హుషారుగా వుండటానికి, ఆడవాళ్ళందరూ తలా ఒకటి, రెండు గిన్నెలు కల్లుతాగారు. కొంత కల్లు పెళ్ళికూతురికీ, ఆమెకు తోడుగా వున్న స్నేహితురాళ్ళకి కూడా వెళ్ళింది. వాళ్ళు పెళ్ళికూతురి శిరసుమీద సిగకు కత్తెరతో తుదిమెరుగులు దిద్దుతున్నారు. కేమ్ చెక్కపొడి ఆమె మెత్తటి వంటికి పులుము తున్నారు.

ఎండ కొంత తగ్గగానే, ఒబైరికా కొడుకు మడ్యూకే ఒక బారు చీపురుతీసుకొని, తన తండ్రి 'ఒబీ'ముందు శుభ్రంగా వూడ్చాడు. ఆ వూడవటం పూర్తి చేయడం కోసమే అంతవరకు ఆగి నట్లుగా, ఒబైరికా చుట్టాలు, స్నేహితులు రావడం మొదలెట్టారు. ప్రతి ఒక్కరిదగ్గరగా భుజం మీద వేలాడుతూ మేకతోలుసంచి, చంకలో చుట్టచుట్టిన మేకతోలు చాపవున్నాయి. మరికొందరైతే తమ కొడుకులతోపాటు వచ్చారు. వారి కొడుకులు అందంగా చెక్కిన చెక్క పీటలు మోసుకువచ్చారు. వారిలో ఓకోన్క్వో కూడా ఒకడు. వాళ్ళందరూ అర్ధచంద్రాకారంలో కూర్చుని అనేక విషయాలు మాట్లాడటం మొదలు పెట్టారు. పెళ్ళివాళ్ళు వచ్చే సమయం దగ్గరకు వచ్చింది.

ఓకోన్క్వో తన ముక్కపొడుం సీసా బయటకు తీసి తన ప్రక్కన కూర్చున్న ఒగ్బ్యుఫి ఇజెన్వాకి ఇచ్చాడు. ఇజెన్వా దాన్ని తీసుకొని, తన మోచిప్ప మీద దాన్ని చిన్నగా తట్టి, ఎడమచేతిలోకి పొడుం విదుల్చుకోడానికి ముందు, అరచేతిని ఒంటికి రుద్దుకొని పొడిగా

చేసుకున్నాడు. ఈ పనులన్నీ అతను కావాలని చేస్తూనే ఇలా అన్నాడు.

"మన వియ్యాలవారు చాలా కుండల నిండా కల్లు తీసుకువస్తారని ఆశిస్తున్నాను. వాళ్ళు పిసినారితనానికి పేరుపడ్డ వూరి నుండి వస్తున్నప్పటికీ, మన అక్కుకే మహారాజుగారికి భార్యకావాల్సిన పిల్ల అని వారు గ్రహించాలి"

"ముప్పైకడవలకంటే తక్కువ కల్లు తీసుకురావడానికి వారు సాహసించలేరు. ఒకవేళ అలా తీసుకురాకపోతే, వాళ్ళకి నా మనసులో మాట చెప్తాను," అన్నాడు ఓకోన్క్వో.

ఆ సమయంలో ఒబైరికా కొడుకు మద్యూకా దొడ్డిలోపలినుంచి, పెద్దమేకను తన తండ్రిబంధువులు చూడటానికి తోలుకువచ్చాడు. అందరూ దాన్ని చూసి"ఏర్పాట్లంటే ఇలా వుండాలి" అని మెచ్చుకున్నారు. ఆ తర్వాత మేకను మళ్ళీ దొడ్లోకి తోలుకెళ్ళారు.

ఆ వెనువెంటనే వియ్యాలవారు దిగడం ప్రారంభించారు. ముందుగా యువకులు, బాలురు వరుసగా ఒక్కొక్కరు ఒక కల్లుకుండ నెత్తిన పెట్టుకొని వచ్చారు. వాళ్ళు వస్తుంటే ఒబైరికా బంధువులు కుండలను లెక్కపెట్టారు. ఇరవై...ఇరవైఐదు...ఆ తర్వాత చాలా సేపటివరకు కల్లుకుండలు రావడం ఆగిపోయింది. ఆడపెళ్ళివారు "నేను చెప్పలేదా." అన్నట్టు ఒకరినొకరు చూసుకున్నారు. తర్వాత మరిన్ని కుండలు వచ్చాయి. ముప్పై-ముప్పైఅయిదు, నలభై, నలభై ఐదు దీనిని చూసి ఆడపెళ్ళివారు "ఇప్పుడు వాళ్ళు మగపెళ్ళివారిలాగా ప్రవర్తిస్తున్నారు" అన్నట్టుగా మెచ్చుకోలుగా తలలు వూపారు. మొత్తంమీద ఏభై కల్లుకుండలు దిగాయి. కల్లుమోసుకు వచ్చినవారివెనుక. పెళ్ళికొడుకు ఇబే, అతని కుటుంబంలోని పెద్దలు దిగారు. వారు కూడా అర్ధచంద్రాకారంలో వియ్యాలవారికి ఎదురుగా కూర్చుని వలయాన్ని పూర్తిచేశారు. కల్లుకుండలు వాళ్ళమధ్య వున్నాయి. తర్వాత పెళ్ళి కూతురు, ఆమె తల్లి, మరో ఆరుగురు ఆడవాళ్ళు, ఆడపిల్లలు దొడ్లోంచి వచ్చి, వలయాకారం చుట్టూ తిరుగుతూ అందరితో కరచాలనం చేశారు. ముందుగా పెళ్ళికూతురి తల్లి దారితీసింది. ఆమె వెనుక పెళ్ళికూతురు, మిగిలిన ఆడవాళ్ళు నడిచారు. పెళ్ళయిన ఆడవాళ్ళు తమకున్న మంచిగుడ్డలు ధరించారు. పెళ్ళికాని ఆడపిల్లలు ఎరుపు, నలుపురంగుపూసలు నడుంచుట్టూ వేసుకొని, కాళ్ళకు ఇత్తడి అందెలు పెట్టుకున్నారు.

ఆడవాళ్ళు లోపలికి వెళ్ళినతర్వాత, ఒబైరికా వియ్యాలవారికి కోలాఫలాలు బహూకరించాడు. మొదటి ఫలాన్ని అతని పెద్దఅన్న పగులగొట్టాడు. పగులగొడుతూ, 'మనందరికీ మంచి ఆయుస్సు వుండుగాక-మన కుటుంబాల మధ్య స్నేహం వర్ధిల్లుగాక! అన్నాడు.

అక్కడ గుమికూడిన జనం అందరూ అన్నారు."ఈ...ఏ..ఏ". (అక్షరాల అలా జరుగుగాక!)

"ఈ రోజు మా అమ్మాయిని నీ చేతుల్లో పెడ్తున్నాం. ఈమె నీకు మంచి ఇల్లాలు అవుతుంది. మనవూరి మాతలాగా, నీకు తొమ్మిదిమంది కొడుకులను ఇస్తుంది."

"ఈ...ఏ...ఏ..."

మగపెళ్ళివారి తరపునుంచి అందరిలోకి వృద్ధుడొకాయన అన్నాడు "అలా జరిగితే మీకూ, మాకూ బాగుంటుంది".

"ఈ...ఏ...ఏ..."

"మా వాళ్ళు మీ ఆడపడుచును పెళ్ళాడటానికి రావడం ఇది మొదటి సారి కాదు. మా అమ్మ కూడా మీ ఆడపడుచే".

"ఈ...ఏ...ఏ..."

"అలాగే ఇది ఆఖరిసారీకాదు. మనిద్దరి మధ్య పరస్పరం అవగాహన, స్నేహం వున్నాయి".
"ఈ...ఏ...ఏ..."
"మీరు భాగ్యవంతులు-గొప్ప యోధులు"అని అతడు ఓకోన్క్వో వైపు చూశాడు" మీ అమ్మాయి కూడా మీలాంటి సుపుత్రులను ఇస్తుంది.
"ఈ...ఏ...ఏ..."
కోలాఫలం తినడం పూర్తయింది. తాటికల్లు తాగడం ప్రారంభమైంది. నలుగురైదుగురు మగాళ్ళు జట్టుగా కూర్చుని కల్లుకుండ తమ మధ్య పెట్టుకున్నారు. సాయంకాలమయ్యేసరికి అతిధులకు భోజనాలు వడ్డించారు. పెద్దపెద్ద బానలనిండా పూపూ, పొగలు కక్కే కుండల్లో పులుసూ, కుండలకొద్దీ యామ్‌జావీ...అది ఒక బ్రహ్మాండమైన విందుభోజనం.

× × ×

చీకటి పడిన తర్వాత, ముక్కాలి పీటల మీద మండుతున్న కాగడాలను పెట్టి,కుర్రకారు ఒక పాట. ఎత్తుకున్నారు. పెద్దలందరూ వలయాకారంలో కూర్చున్నారు. గాయకులు వలయం చుట్టూ నడుస్తూ, ఒక్కొక్కరి దగ్గరాఆగి అతన్ని పొగుడుతున్నారు. ప్రతి ఒక్కరి గురించీ పొగడటానికి, వారిలో ఏదో ఒక విశిష్టత వుంది. కొందరు గొప్ప రైతులు-మరికొందరు తమ తెగకోసం మాట్లాడేగొప్పవక్తలు; ఓకోన్క్వో అయితే ఇప్పుడు జీవించి వున్న వాళ్ళందరిలోకీ గొప్ప మల్లయోధుడు. అలా వలయం అంతా తిరిగి పాడటం ముగిసాక, వాళ్ళు వలయం మధ్యలోకి వచ్చి కూర్చున్నారు. అప్పుడు దొడ్లోంచి ఆడపిల్లలు నాట్యం చేయడానికి వచ్చారు. ముందు పెళ్ళికూతురు వాళ్ళలో లేదు. కాని ఆమె చివరికి తనకుడిచేతిలో కోడిపుంజును పుచ్చుకొని అందరిముందు నిలబడగానే, జనమంతా సంతోషంగా కేకలు పెట్టారు. మిగిలిన నాట్యకత్తెలందరూ ఆమెకు దోవ ఇచ్చారు. ఆమె కోడిపుంజును గాయకులకు కానుకగా ఇచ్చి, నాట్యం చేయడం ప్రారంభించింది. ఆమె నాట్యం చేస్తుంటే ఆమె కాలి ఇత్తడిఅందెలు గలగలమన్నాయి. ఆమె వంటికి పూసిన 'కేమ్'చెక్కపొడి, పల్చటి పసుపు వెలుతురులో మెరిసిపోతోంది. పాటగాళ్ళు తమ చెక్కవాద్యాలతో, మట్టివాద్యాలతో, లోహవాద్యాలతో ఒక పాట తర్వాత మరోపాట అందుకుంటున్నారు. అందరూ హుషారుగా వున్నారు. ఊళ్ళోకి కొత్తగా వచ్చిన ఒక పాటను వాళ్ళు పాడారు;

"చిన్నదాని చేయి నేను పట్టుకుంటే
'నన్నుముట్టొద్దు'అంది
చిన్నదాని కాలు నేను పట్టుకుంటే
'నన్ను అంటుకోకు'అంది
కానీ,
చిన్నదాని నడుం పూసలు నేను పట్టుకుంటే
తెలియనట్లు నటించింది".

పెళ్ళికొడుకు కుటుంబంతో ఏడు సంతవారాలు గడపటంకోసం, పెళ్ళికూతురిని తమతో తీసుకువెళ్ళడానికి అతిధులు లేచేసరికి, రాత్రి బాగా పొద్దుపోయింది. వెళ్ళేటప్పుడు కూడా వాళ్ళు పాటలు పాడుకుంటూవెళ్ళారు. వెళ్ళేముందు ఓకోన్క్వో లాంటి ముఖ్యులవద్దకు మర్యాద పూర్వకంగా వెళ్ళారు. ఓకోన్క్వో వారికి రెండు కోడిపుంజులను బహూకరించాడు.

(ఇంకావుంది)

# పిల్లల ప్రపంచం

స్వాతంత్ర్య వీరుడా !
స్వరాజ్య భానుడా !!
అల్లూరి సీతారామరాజా !!
అందుకో మాపూజలందుకో రాజా
అల్లూరి సీతారామరాజా !!
తెల్లవారి గుండెలలో నిదురించినవాడా !
మా నిదురించిన పౌరుషాగ్ని
రగిలించినవాడా !!
త్యాగాలే భరిస్తాం
కష్టాలే సహిస్తాం
నిశ్చయముగ నిర్భయము
నీవెంటనె నడుస్తాం !

-శ్రీశ్రీ

# అల్లూరి సీతారామరాజు బాల్యం

- డా॥కరెవరపు వెంకట్రామయ్య



బాల్యంలో అల్లూరి

బాలలూ! "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపీ గరీయసీ" అనే సంస్కృత సూక్తిని మీరు తరచుగా వింటుంటారు కదా! దాని అర్థం మీకు తెలుసా? కన్నతల్లీ, పుట్టినగడ్డా స్వర్గం కన్నామిన్న అయినవి అని ఆ వాక్యానికి అర్థం. కన్నతల్లిని ప్రేమించని కొడుకు వుండనట్లే; మాతృదేశాన్ని ప్రేమించని మనిషీ ఎక్కడా వుండడు. కాబట్టే దేశభక్తి ప్రతి జాతికి పుట్టుకతో వారసత్వంగా సంక్రమించే గుణం అయి వుంటుంది. ఈ దేశభక్తి నివురుగప్పిన నిప్పు లాంటిది. సాధారణ పరిస్థితుల్లో దాని ఉనికే కనిపించదు. అదే పరిస్థితి అస్తవ్యస్తమైతే, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కోల్పోతే, దేశం పరాయిపాల కుల అధీనమైతే-సివంగిలా విజృంభిస్తుంది. ప్రభంజనంలా ఊపివేస్తుంది. లావాలాగా ఆక్ర మిస్తుంది. పగవాడి అంతు తేలుస్తుంది.

అలాంటి దేశభక్తికి సాటిలేని మేటి ఉదాహరణ మన అల్లూరి సీతారామరాజు

ఆంధ్రుల చరిత్రలోనే కాదు, భారతదేశ చరిత్రలోనే అల్లూరిపేరు రక్తాక్షరాలతో రంగరించి దిద్దతీర్చబడింది. జీవించింది కేవలం 27సంవత్సరాలే! అందులోనూ విప్లవ జీవిత కాలం రెండంటే రెండే సంవత్సరాలు. ఆ అల్పకాలంలోనే తన పోరాట పటిమతో, విప్లవ కార్యాచరణతో తెల్లవారి గుండెలలో నిదురించాడు. నిదురించిన మన పౌరుషాగ్నిని రగిలించాడు. అణగారిన మన్యసీమనే కోటగా మలచుకొన్నాడు. అడవి బిడ్డలను-గిరిజనులను- అనుచరులుగా చేసికొన్నాడు. అడవి, అడవిలోని భూమి, నీరు, సమస్త సంపద అనుభవించే హక్కు గిరిజనులదే నన్నాడు. పోడు వ్యవసాయా నికి పన్ను కట్టనక్కరలేదన్నాడు. గిరిజను లను నిలువుదోపిడీ చేస్తున్న దళారుల మీదా, వారికి అండదండలుగా వున్న బ్రిటీష్ అధికారులమీద విల్లు ఎక్కుపెట్టాడు. అడవన్నలలో పౌరుషాగ్ని రగిలించాడు. స్వాతంత్ర్య సమర యజ్ఞంలో సమిధ అయ్యాడు. అల్లూరి ఒక వ్యక్తికాదు. మహాశక్తి, విప్లవానికి సంకేతం ఆయన జీవితం. భువన భవనపు బావుటా అయి పైకి లేచిన ఆ మహనీయుని మహోన్నత ఆదర్శాలకు-బాలలూ! మీరే వారసులు. వినండి మరి! అల్లూరి బాల్యం గురించి.

★ ★ ★

అప్పటికింకా పశ్చిమగోదావరిజిల్లా ఏర్పడలేదు. అందువల్ల నేటి భీమవరం తాలూకా ఆనాడు కృష్ణాజిల్లాలో అంతర్భాగమై వుండేది. భీమవరానికి ఆరుమైళ్ళ దూరంలో మోగల్లు అనే గ్రామం వుంది. ఆ వూళ్ళో అల్లూరి వారి కుటుంబాలు రెండు వుండేవి. అసలు వీరి పూర్వీకులు గుంటూరుమండలం లోని 'బొప్పుడి'కి చెందినవారు. మోగల్లులోని అల్లూరి కుటుంబానికి చెందినవాడే మన రామరాజు. ఆయన ముత్తాత గోపాలకృష్ణంరాజు. తాత వెంకట కృష్ణంరాజు. ఈ వెంకట కృష్ణంరాజు గార్కి, రామచంద్రరాజు, వెంకట రామరాజు, రామకృష్ణంరాజు, రంగరాజు, రామభద్రరాజు అనే అయిదుగురు కొడుకులు పుట్టారు. వీరిలో రెండవవాడైన వెంకట రామరాజే మన అల్లూరి సీతారామరాజు తండ్రి.

వెంకటరామరాజు స్కూల్‌ఫైనల్ దాకా చదువుకొన్నాడు. అందువల్ల ఇంగ్లీషుభాష బాగానే వచ్చు. ఈయన తాతగారి సోదరి 'రాజయ్యమ్మ' అనే ఆవిడ ఒకరు వుండేవారు. ఈమె సంస్కృతభాషలో మంచి పాండిత్యం గలది. అందువల్ల 'పండిత రాజయ్యమ్మ'అని ఈమెను పిలిచేవాళ్ళు. గుంటూరు ప్రాంతం నుంచేకాక, కాశీనగరం నుంచి కూడా ఈమె దగ్గరకు పండితులు వచ్చి, భాషా సాహిత్యాల్లో తమకున్న సందేహాల్ని తీర్చుకొని వెళ్ళేవాళ్ళట. ఈవిడ దగ్గర వెంకటరామరాజు సంస్కృతాన్ని కూడా నేర్చుకొన్నాడు.

వెంకటరామరాజు మేనమామ చింతలపాటి సుబ్బరాజుగారు. ఈయనకొక కుమార్తె వుండేది. తన కుమార్తెను మేనల్లుడు వెంకట రామరాజునకిచ్చి వివాహం చేయతలపెట్టాడు. మేనరికమంటే ఇష్టంలేని వెంకటరామరాజు, ఇంట్లో నుంచి కొంతసొమ్ము, బంగారం పట్టుకొని రహస్యంగా బొంబాయి వెళ్ళిపోయాడు. అక్కడ చిత్రలేఖనం, ఫొటోగ్రఫీ, మ్యాజిక్ లాంతర్ ప్రదర్శన నేర్చుకొన్నాడు. ఆ తర్వాతి ఎప్పుడో ఇంటికి తిరిగివచ్చి, ఫొటోగ్రాఫర్‌గా జీవితం ఆరంభించాడు. మొదట నర్సాపురంలోనూ, ఆపై తణుకులోనూ స్టూడియోలు పెట్టాడు.

1893లో వెంకటరామరాజు వివాహం పాండ్రంకి గ్రామవాస్తవ్యులు మందలపాటి శ్రీరామరాజుగారి కుమార్తె సూర్యనారాయణమ్మతో సింహాచలం దేవాలయంలో

జరిగింది. సూర్యనారాయణమ్మ పూర్వీకులది అనకాపల్లి దగ్గర తిమ్మనపాలెం. తర్వాత వాళ్ళు విజయనగరం దగ్గర 'పాండ్రంకి'లో స్థిరపడ్డారు. ఈ దంపతులకు పుట్టిన ప్రథమ సంతానమే సీతారామరాజు. 1897వ సంవత్సరం జూలై నాల్గవతేదీన రామరాజు రమ్మమ్మగారి గ్రామమైన 'పాండ్రంకి'లో పుట్టాడు. రామరాజు తర్వాత 1901లో సీతమ్మ అనే కుమార్తె, 1906లో సత్యనారాయణరాజు అనే మరో కుమారుడు వీరికి కలిగారు.

తణుకులో ఫొటోస్టూడియో బాగా నడవక పోవడం చేత వెంకటరామరాజు 1902లో కుటుంబంతోసహా రాజమహేంద్రవరం చేరుకున్నాడు. ఇన్నీస్‌పేటలో ట్రెయినింగ్ కాలేజీకి తూర్పున మెయిన్ రోడ్డులో జవ్వాది వారి కొట్లలో ఒక భాగం అద్దెకు తీసుకొని దానిలో స్టూడియో పెట్టాడు. ఫొటోగ్రాఫర్‌గా వెంకట రామరాజుగార్కి మంచి పేరొచ్చింది. ఆదా యం కూడా పెరగసాగింది. చేతినిండా పని. రాజమండ్రి సెంట్రల్ జెయిల్‌లోని ఫొటోలను కూడా ఆయనే తీసేవాడు.

వెంకటరామరాజులో జాతీయభావాలు ఎక్కువగా వుండేవి. ఫొటోగ్రాఫర్‌గా తిలక్, లాలాలజపతిరాయ్ వంటి ప్రముఖ జాతీయ నాయకుల ఫొటోలు ఆయన తీశాడు. వాటిని ఎన్‌లార్జ్‌చేసి, తన స్టూడియో గోడలకు అలం కరించాడు. ఇంతలో 1905లో బెంగాల్ విభజన జరిగింది. స్వదేశీ ఉద్యమం ప్రారంభమయింది. 'వందేమాతరం' నినాదాలు దేశమంతా మిన్ను ముట్టాయి. వెంకటరామరాజు ప్రత్యక్షంగా ఈ ఉద్యమంలో పాల్గొనకపోయినా, ఇంట్లోనే ఈ నినాదాలు చేసేవాడు. ఆ ప్రభావం బాలుడైన సీతారామరాజు మీద పడింది.

సీతారామరాజు చిన్నతనం నుంచే ఎంతో అందంగా వుండేవాడు. మంచి ముఖవర్చస్సు. ఆకర్షణీయంగా వుండేవాడు. చిన్నప్పటి నుంచి జంతువులపట్ల ప్రేమ, దయ చూపించేవాడు. దేవుడంటే భక్తి కలిగివుండేవాడు. చాలా చురు కుగా వుండేవాడు. తండ్రి స్వతంత్ర భావాలు కూడా ఆ బాలుడిని ప్రభావితం చేశాయి.

ఒకరోజు సాయంత్రం రాజమహేంద్ర వరంలో బాలుడు సీతారామరాజు తండ్రితో కలసి వీధిలో వెళ్తున్నాడు. ఆ సమయంలో ఒక తెల్లదొర గుర్రంమీద రావడం జరిగింది. వీధిలో నడుస్తూ వారందరూ ఆ తెల్లదొరకు నమస్కరిస్తున్నారు. అది చూసి సీతారామరాజు కూడా నమస్కరించటానికి చేతులెత్తాడు. తక్షణం తండ్రి ఆ చేతులమీద ఏ టపీమని కొట్టి "తెల్లవాడికి నమస్కరిస్తావా? వాళ్ళు నీచులు. మనదేశాన్ని ఆక్రమించుకొని దోపిడీ చేస్తున్న దొంగలు. వాళ్ళకి నమస్కరించటం మన ఆత్మాభిమానానికి గొడ్డలిపెట్టు" అని మందలించాడు. అర్థమైనంతమేరకు ఆ పసిహృదయంలో ఆ మాటలు నాటుకున్నాయి. తెల్లవాళ్ళు మన శత్రువులు అనే ముద్ర హృద యంపై పడింది.ఆ రోజుల్లోనే మరో సంఘ టన జరిగింది. ఒకనాడు సీతారామరాజు, అతని మిత్రులూ కలసి గోదావరినదికి వెళ్ళారు. వారిలో ఎవరికీ ఈత రాదు. ఒడ్డున నీళ్ళలో ఆటలాడు కుంటున్నారు. ఇంతలో ఒక బాలుడు నీళ్లలోతులో కెళ్ళి మునిగిపోతూ, ఊపిరాడక ఉక్కిరిబిక్కిరయ్యాడు. ఈతరాని రామరాజు ధైర్యంచేసి, నీళ్లలో దూకి, మిత్రుణ్ణి వెలుపలికి లాక్కువచ్చాడు. జరిగిన విషయం విన్న తల్లి సూర్యనారాయణమ్మ గుండెలు బాదుకొంది. తండ్రికొడుకు సాహసాన్ని మెచ్చు కొన్నా; ఇతరులకోసం తన ప్రాణాలమీదికి తెచ్చుకొంటాడేమోనని మనసులో కలవర పడ్డాడు. అదే చివరకు నిజమయింది కూడా. జాతికోసం సీతారామరాజు ప్రాణాల్ని తృణ ప్రాయంగా వదిలాడు. ఈ బాల్య సంఘటన దానికి సూచకమేమో !

బాలుడు సీతారామరాజుకు అయిదవ యేట మోగల్లులో విద్యాభ్యాసం జరిగింది. చిన్న తరగతుల్లో ఎంతో తెలివిగా మెలగేవాడు. అందుచేత ప్రాథమిక పాఠశాలలో మూడవ తరగతి నుంచి అయిదవ తరగతిలో వేశారు. ఈ సమయంలోనే వందేమాతరం ఉద్యమం ఊపందుకొంది. బిపిన్‌చంద్రపాల్ ఆంధ్ర దేశంలో పర్యటించాడు. రాజమహేంద్రవరంలో ఉపన్యసించాడు. తెల్లప్రభుత్వానికి వ్యతిరేకంగా కరపత్రాలు పంచారు. ప్రజలంతా ఆ ఉప న్యాసాలచేత ఆకర్షింపబడ్డారు. వెంకటరామ రాజు కుమారుణ్ణి వెంకటబెటుట్టకొని ఆ మీటింగుకి తీసికెళ్ళాడు. పెద్దపెద్ద నాయకులను చూడటం, వారి ఉపన్యాసాలను వినడం సీతారామరాజుకు ఈ విధంగా బాల్యం నుంచే అలవాటయ్యింది. ఆనాటి ఆ సంచలన వాతావరణం, తండ్రి ఇతరులతో చేసే జాతీయోద్యమ సంభాషణలూ బాలరామరాజు మనోఫలకం మీద చెరగని ముద్ర వేశాయి.

రామరాజు ఆరవ తరగతిలోకి వచ్చాడు. అది 1908వ సంవత్సరం, గోదావరి పుష్కరాలు వచ్చాయి ఆయేడు. యాత్రికులు ఇబ్బడి ముబ్బడిగా వచ్చారు. ఆరోగ్య పారిశుద్ధ్య ఏర్పాట్లలోపం వల్ల కలరా ప్రబలింది. వెంకట రామరాజుకు ఆ వ్యాధి సోకింది. ఎన్ని ప్రయ త్నాలు చేసినా కలరా తగ్గలేదు. అట్లతద్దినాడు వెంకట రామరాజుగారు కన్నుమూశారు. పచ్చని కుటుంబ జీవితం మీద విషాదమేఘాలు ముసురుకున్నాయి. సూర్యనారాయణమ్మ అనాధ అయింది. పిల్లలు తండ్రిలేని వార య్యారు. అప్పటికి రామరాజు వయసు పన్నెండు సంవత్సరాలే !

భర్త మరణంతో సూర్యనారాయణమ్మ కష్టాలు ప్రారంభమయ్యాయి. పట్టణంలో వుంటే ఖర్చు ఎక్కువ కాబట్టి ఏదైనా పల్లె టూరులో వుండటం మంచిదని, వెంకట రామరాజు తమ్ముడు రంగరాజు సలహా యిచ్చాడు. సూర్యనారాయణమ్మ కాపురాన్ని భీమవరంతాలూకా కొవ్వాడకు మార్చింది. కొవ్వాడలో ఆమె చెల్లెలు అప్పల నరసయ్యమ్మ వుంది. రామరాజును 1909లో భీమవరం మిషన్‌స్కూలులో చేర్పించింది. కొవ్వాడ నుంచి భీమవరం రెండుమైళ్ళు. అప్పట్లో ఇప్పటిలా రోడ్లులేవు. రోజా బడికి కాలినడకన నడిచి వెళ్ళటం, వానాకాలంలో అయితే పుంతవెంట బురదలో వెళ్ళవలసి రావటం. బాలుడు రామరాజుకు చిరాకు, విసుగూ కలిగించాయి. అప్పటి దాకా టౌన్‌లో వున్నవాడు కదా! దాంతో ఒకరోజు బడికి వెళుతూ, ఇంట్లో మందుగావాడే గరళపు మాత్రల సీసాను పట్టుకెళ్ళాడు. దాన్లోని 200 మాత్రలూ మింగివేశాడు. ఇంటికి వచ్చేటప్పటికి మంటలు మండే జ్వరం. మంచం పట్టాడు. దాన్నుంచి కోలుకొనేటప్పటికి మూడు నెలలు పట్టింది. కర్రపట్టుకొని నడవాల్సిన పరిస్థితి ఏర్పడింది. స్కూలు పోయింది. ఆరవ తరగతి (మొదటిఫారం) మూడోసారి చదవవలసివచ్చింది బాలుడు రామరాజు.

సూర్యనారాయణమ్మ రామరాజుని మళ్లీ భీమవరం తీసుకొచ్చేసింది. తమ దగ్గర బంధువు అల్లూరి రామరాజు దగ్గర ఉంచింది. ఈయన అప్పుడు బి.ఏ. చదువుతుండేవాడు. ఈయన్నే "చెవిటిరాజుగారు" అనేవారు. ఈయన ఏకసంధాగ్రాహి. కాశీలో కొంతకాలం విద్యాభ్యాసం చేసినవాడు. వేదాంతంలో దిట్ట. యోగాభ్యాసంలో ప్రవీణుడు. రామరాజు ఈయన సాహచర్యంతో యోగాభ్యాసం నేర్చుకొన్నాడు. హఠయోగప్రదీపిక, పతంజలి యోగసూత్రములు ఆయన ముఖతః చదువు కొన్నాడు. భావిజీవితంలో రాజు కొంతకాలం యోగిగా గడపటానికి నేపథ్యం ఇదే! మొదటి ఫారం పాసయ్యాడు. ఈ సమయంలోనే సీతారామరాజు ప్రాచీన తెలుగు కావ్యాలు

చదవటం, స్వయంగా పద్యాలు వ్రాయటం ఒక మేరకు నేర్చుకొన్నాడు.

ఈ సమయంలోనే రాజు పినతండ్రి రామకృష్ణంరాజుగారు రామచంద్రపురంలో మేజిస్ట్రేటుగా వుండేవారు. సూర్యనారాయణమ్మ కొడుకిని మరిది దగ్గర వుంచింది. అక్కడే 1911లో రెండవ ఫారంలో చేర్పించింది. కానీ సంవత్సర మధ్యంలో రామకృష్ణంరాజు గారికి కాకినాడ బదిలీ అయింది. ఆయన కాకినాడ వెళ్ళిపోయాడు. సూర్యనారాయణమ్మ కొడుకు కోసం రామచంద్రపురంలో కాపురం పెట్టింది. రాజు రెండవ ఫారం పాసయ్యాడు. ఆ మరుసటి ఏడాది కాకినాడ పిఠాపురం రాజా హైస్కూలు మూడవ ఫారంలో చేర్చారు. చిన్నాన్న సంరక్షణలో రాజు హైస్కూలులో చదువు సజావుగా సాగింది. ఆ సమయంలోనే అకుంఠిత త్యాగధనులుగా పేరొందిన నాయకులు మద్దూరి అన్నపూర్ణయ్యగారు కూడా అదే హైస్కూలులో మూడవఫారం చదివారు. ఇద్దరి డివిజనులు వేరు. రాజు మితభాషిగా వుండేవాడు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ వుండేవాడు. ఎక్కువ సమయం ఏకాంతంగా గడిపేవాడు. పాఠశాల విడిచిపెట్టగానే సముద్రతీరానికి వెళ్ళేవాడు. లేకపోతే కళింగళ దగ్గరకు వెళ్ళేవాడు గుర్రపు స్వారీ చేసేవాడు. వ్యాయామం, యోగాభ్యాసం చేసే వాడు. కవిత్వం, కొద్దికొద్దిగా చెప్పేవాడు. ఒక్కోసారి తెల్లని బట్టలు ధరించి అందంగా కన్పించేవాడు. క్రమేపి పాఠాలమీద శ్రద్ధ తగ్గింది. ఒకసారి యువకుడు మద్దూరి మిత్రుడు రామరాజుని ఆ విషయమే ప్రశ్నించగా, "ఇది విద్యయా? మనదేశ విద్యయే నిజమైన విద్య. నేను సన్యాసినయ్యెదను. లోకోద్ధరణ కుపకరించు విద్యయే విద్య"అని సమాధానమిచ్చాడట. రామరాజుకు నాటకాలన్నా, తాలింఖానాలన్నీ మోజు పెరిగింది. తాను నాటకాల్లో వేషాలు కూడా వేసేవాడు.

రామరాజు పేదరికంలో వుండి కూడా తన పేదరికాన్ని కప్పిపుచ్చుకోవాలని ప్రయత్నిస్తూ వుండేవాడు. ఖరీదైన బట్టలు ధరిస్తే, పేదరికం కప్పివేయబడుతుందని ఆతని ఊహ. కానీ....ఆ అభిప్రాయం ఒకే ఒక్క సంఘటనతో పటాపంచలయింది.

అప్పట్లో ప్రతిసంవత్సరం డిసెంబరు 12వ తేదీన పంచమజార్జి చక్రవర్తి పట్టాభిషేక వార్షికోత్సవాలు జరిపేవారు. ఆ యేడు (1912) పిఠాపురం రాజా కళాశాలలో కూడా జరిపారు. ఆ ఉత్సవంలో రకరకాల వేడుకలు, సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. విద్యార్థులు "శశిరేఖా పరిణయం" అనే నాటకాన్ని ప్రదర్శించారు. ఆ నాటక ప్రదర్శనలో రామరాజు పాల్గొన్నాడు. శశిరేఖ పాత్రనూ, నారదపాత్రనూ అత్యద్భుతంగా పోషించాడు. అతని రూపం, గానం, అభినయం సభాసదుల్ని ఆనంద ఆశ్చర్యాలలో ముంచెత్తాయి. సరే! నాటకం అయిపోయింది. వేషం కోసం కట్టిన చమ్కీబట్టలు విప్పి వేశాడు. రాజులో జ్ఞాననేత్రం విచ్చుకొంది. మంచి బట్టలు కట్టుకొన్నంత మాత్రాన నిజమైన పేదరికం మరుగున పడదనీ, దాని నీడలు అలాగే వుంటాయనీ గుర్తించాడు. ఇక ఆ రోజు మొదలుకొని తాను నిరాడంబరంగా జీవించడం మొదలు పెట్టాడు.

నాటకంలో వేషం వేసినందుకు బహుమతిగా ఒక పతకం ఇచ్చారు. దాని మీద అయిదవ చక్రవర్తి బొమ్మ వుంది. ఆ పతకాన్ని రాజు ఎప్పుడూ ధరించేవాడు. ఆ విషయాన్నే మద్దూరి అన్నపూర్ణయ్యగారు అడిగారట. మిత్రుడితో రామరాజు వెంటనే " తెల్లవాడు మనగుండెపై తిష్ట వేసినాడు. ఆ విషయం మరచిపోకుండా, అనుక్షణం నన్ను హెచ్చరిస్తున్నట్లు దీన్ని ధరిస్తున్నాను" అన్నాడట. అంతటి లేతవయసులోనే ఎంతటి లోతు భావాలు కలిగి వుండేవాడో, ఈ మాటలవల్ల తెలుస్తోంది.

క్రమం తప్పకుండా తాలింఖానాకు వెళ్ళటం కాకినాడలో రాజు దినచర్యలో భాగమయింది. బస్కీలు, వ్యాయామ విద్య నేర్చుకోసాగాడు. ఎదుటివాడిని నేర్పుగా కొట్టడం, ఎదుటివాని దెబ్బ నుండి నేర్పుగా తప్పించుకోవడం మొదలైన ఒడుపుల్ని తాలింఖానాలో బాగా నేర్చుకొన్నాడు. అవే భావి విప్లవ జీవితంలో రాజుకు రక్షణ కవచాలయ్యాయి. ఆ రోజుల్లోనే రాజు ఇంకా మ్యాజిక్ చేయటం, మ్యాజిక్‌ల లాంతరుతో బొమ్మల్ని చూపించటం (అప్పటికి తండ్రి ఫొటోగ్రఫీ సామానులు వుండేవి) మొదలైనవి ఎన్నోచేసి, తోటి విద్యార్థుల్ని వినోద పరచేవాడట.

కాకినాడలో రాజు చదువుకొనేటప్పుడు అతని తల్లి, చెల్లెలు, తమ్ముడు పాయకరావుపేటలో వుండేవారు. అప్పుడే అన్నవరంలో రాజుకు ఉపనయనం జరిగింది. రాజు మూడవ ఫారం పాసయ్యాడు. సూర్యనారాయణమ్మకు పాయకరావుపేటలో కుటుంబం గడవటం కష్టమవటంవల్ల, పిల్లలతో పుట్టింటికి 'పాండ్రంగి' కి వెళ్ళింది. దగ్గరగా వుంటాడని కొడుకుని విశాఖపట్నం మిషన్‌స్కూలులో నాల్గవఫారంలో చేర్పించింది. అక్కడ రాజుపై ఎవరి అజమాయిషీ లేదు. దాంతో వృధాఖర్చులు చేస్తూ పాఠశాలకు వెళ్ళకుండా కాలక్షేపం చేయ టం మరిగాడు. తల్లికి ఈ విషయం తెలిసి, పిల్లవాడు చెడిపోతున్నాడని తలంచి, దగ్గరుంటే కాని దారిలో వుండడని భావించి కుటుంబాన్ని విశాఖపట్నంకి మార్చింది. కానీ రెండునెలలకే కొందరితో అభిప్రాయభేదాలు రావటంవల్ల, మిషను పాఠశాలలో చదువుకు స్వస్తిచెప్పాడు రాజు. 1912 సెప్టెంబరు 20వతేదీన విశాఖపట్నంలోనే ఎ.వి.యన్.హైస్కూలులో నాల్గవ ఫారంలో చేరాడు. కానీ రాజుకు అకస్మాత్తుగా కలరావ్యాధి సోకింది. అతికష్టంమీద కోలుకున్నాడు. కానీ చదువు దెబ్బతింది. హాజరు చాల్లేదు. నాల్గవఫారం తప్పిపోయాడు. కుటుంబ పరిస్థితి కూడా మరింత దిగజారింది. ఆ సమయంలో రామరాజు పినతండ్రి రామకృష్ణంరాజు నర్సాపురంలో తహసీల్ దారుగా పనిచేస్తూ వున్నాడు. ఆయనకు ఉత్తరం వ్రాయగా, రాజును తన వద్దకు పంపించమనీ, తాను చదువుకు చెప్పించగలననీ తిరుగు లేఖ వ్రాశాడు. తల్లి రాజును నరసాపురం పంపింది. అక్కడ టైలర్ హైస్కూలులో 1913 జూలై 2వతేదీన రాజు తిరిగి నాల్గవ ఫారంలో చేరాడు.

నరసాపురం దగ్గర చించినాడ అనే చిన్న పల్లెటూరు వుంది. ఆ గ్రామ మునసబుగారికి ఒక పెంకి గుర్రముండేది. మునసబుగారి కుమారులతో రాజుకు మంచిస్నేహం. అందువల్ల శని, ఆదివారాలలో చించినాడు వెళ్ళేవాడు. అక్కడున్న పెంకిగుర్రం సంగతి తెలుసుకున్నాడు. ఒక్కరోజులోనే దాన్ని స్వాధీనంలోకి తెచ్చుకున్నాడు. ఇక అది మొదలు రాజుకు గుర్రంస్వారీ ప్రతివారం క్రమం తప్పనిదైంది. ఆ రోజుల్లోనే అతడు చదరంగం కూడా అభ్యాసం చేశాడు.

నరసాపురంలో వుండగానే; మాఘశుద్ధ ఏకాదశినాడు అంతర్వేది తీర్థానికి పినతండ్రి కుటుంబంతో కలిసి వెళ్ళాడు. అక్కడ పినతల్లికి చెప్పి, రాజు చించినాడ వెళ్ళిపోయాడు. ఈ విషయం రామకృష్ణంరాజుగారికి తెలియదు. రాజు కోసం అన్నివైపులా వెదికించాడు. తునిలో వున్న వదినగారికి కబురు చేశాడు. భార్య ఆయనకు అసలు విషయం చెప్పలేదు. రెండు రోజులకు గాని రాజు ఇంటికి తిరిగిరాలేదు. రామకృష్ణంరాజు కోపం పట్టలేక రాజుమీద చెయిచేసికొన్నాడు. అసలు తల్లిదండ్రులు కొడితేనే పడని తాను, పినతండ్రి-అందులోనూ బంట్రోతు లందరిముందూ కొట్టడం, తీవ్ర అవమానంగా భావించి రాజు పినతండ్రి ఇల్లు విడిచి పెట్టేసి వెళ్లిపోయాడు. మళ్లీ పినతండ్రి పెద్దకూతురు పెళ్లికి రాజు పినతండ్రి ఇంటికి వెళ్ళాడు. అంత పట్టుదల అతనిది.

నరసాపురం నుండి రాజు తునిలో వున్న తల్లి దగ్గరకు వచ్చేసి, అక్కడ పాఠశాలలో చేరాడు. చదువు మీద ఏపాటి శ్రద్ధా కనబరచేవాడు కాదు. పినతండ్రి పాఠశాల ప్రధానోపాధ్యాయుని పేర రాజు చదువుకి డబ్బు పంపుతుండేవాడు. విద్యార్థి రాజుకు విద్యపట్ల ఏ మాత్రం ఆసక్తిలేదని, ఆయన రామకృష్ణంరాజుగారికి తెలియచేయటం కూడా జరిగింది. రాజు ప్రవర్తనతో రోజురోజుకు విసిగి పోయిన ప్రధానోపాధ్యాయుడు, ఒకనాడు పాఠ శాలకు ఆలస్యంగా వచ్చిన రాజును బెత్తంతో కొట్టాడు. ఆ రోజునుండి మరి రాజు బడికి వెళ్ళలేదు. ఆ బడికే కాదు చదువుకే ఏకంగా స్వస్తి చెప్పాడు !

1913నుంచి 1918దాకా రాజు కుటుంబం తునిలోనే వుంది. రాజు కొండలూ కోనలూ పట్టుకొని తిరిగేవాడు. అక్కడ తపస్సు చేసి కొనేందుకు అనువైన ప్రదేశాలను వెతికేవాడు. మన్యప్రాంత ప్రజల గురించీ, వారి జీవితాల గురించీ, జీవిత విధానాల గురించీ ఆలోచిస్తూ వుండేవాడు. అప్పుడే ధారపర్వతాలు, కృష్ణదేవు పేట అడవులు, ఇతర మన్యప్రాంతాలు చూశాడు. వత్సవాయి నీలాద్రిరాజుగారు తునిలో ఆస్థాన కవి. ఆయన జ్యోతిషశాస్త్రంలో ప్రవీణుడట. రాజు ఆయన దగ్గర ఆ శాస్త్రాన్ని నేర్చుకొన్నాడు. దాని ద్వారా గిరిజనుల జాత కాలు వ్రాసి యిచ్చేవాడు రాజు. ఇంకా జాత కాలు వ్రాయడం, చక్రాలు వేయడం, తాయె త్తులు కట్టడం, వాస్తు శాస్త్రానికి సంబంధించిన విషయాలు మొదలైన విషయాలు అనేకం రాజు తునిలోనే నేర్చుకొన్నాడు.

1917 మార్చి17న గొలుగొండ తాలూకా పెదబైరవి భూపతి అగ్రహారం చేరాడు రాజు. సూరి సుబ్బయ్యశాస్త్రి ఆ అగ్రహారంలో మహాపండితుడు. రాజు వారాలు చేసుకుంటూ ఆయన దగ్గర సంస్కృతం నేర్చుకోసాగాడు. ఐదారు నెలల్లోనే పంచకావ్యాలు పూర్తి చేశాడు. మంత్రశాస్త్రాన్నీ, ఇంద్రజాలాన్నీ నేర్చుకొని వనమూలికలను వాడే పద్ధతిని అధ్యయనం చేశాడు. ఆసనాలూ, యోగాభ్యాసం, ప్రాణా యామాలను సాధన చేసే ప్రయత్నాలు చేశాడు.

తునికి ఆరుమైళ్ళదూరంలో గోపాలపట్నం అనే గ్రామం వుంది. అక్కడ రామరాజు పెదతల్లి వుండేది. తల్లితో కలసి రామరాజు ఆమె యిం టిలో రెండు సంవత్సరాలున్నాడు. ఎక్కువ సమయం ఆ వూరి శివాలయంలోనే గడిపే వాడు. అక్కడ 'సీతమ్మవారి కొండ'అనే ఒక కొండ వుంది. ఆ కొండ మీద వున్న ధర్మలిం గేశ్వరాలయంలో రాజు కొంతకాలం తపస్సు చేశాడు కూడా. ఆ కొండమీద వున్నప్పుడే రాజు ఆశువుగా చెప్పిన రెండు సీసపద్యాలలో కొంతభాగాలు దొరికాయి. రాజు కవితాభ్యా సాన్ని ఇవి తెలియచేస్తున్నవి. చూడండి !

సీ. "శ్రీ వసిష్ఠునికడ చిఱుత ప్రాయము నాడె
నేర్చి విద్యలనెల్ల నేర్పుతోడ
తన సతి గూజుక వనమున వసియించి
మునుల నెల్లరజూచి మ్రొక్కి వారి
దీవనల్ బడసి మర్దించి శత్రుల నెల్ల
వీలుగా మన దేశ మేల దలంచె

* * *

గీ. బ్రాహ్మణోత్తము లెల్లరు ప్రమదమునను
చేయుడు తపములన్ స్థిర చిత్తములను

* * *

సీ. శ్రీపార్వతీనాధ చిన్మయ పరమేశ
నందివాహన సాంబ నాగభూష
గంగాజటాజూట అంగజహరయీశ
భృంగీశ సన్నుత మృత్యునాశ.

* * *

గీ. శ్వేతవర్ణ శుభాంగోగ్ర భూతనాధ
నీలకంధర నిఖిలేశ నిగమ వినుత
పరమ పురుష జగన్నాథ భక్తవరద
తండ్రి పాండవ నగవాస ధర్మలింగ".

గొప్ప విద్యావంతుడు కాలేకపోయినా రాజు అపూర్వ మేధావి.

మొత్తం మీద రాజు బాల్యమంతా తెగిన గాలిపటంలాంటిది. నిలుకడ లేదు. ఒక పాఠశాలకాదు. ఒక ఊరు చదువా అబ్బలేదు. చివరికి 'ఉద్యోగం సంపాదిస్తాను, సొమ్ము కావాలి'అని చెప్పి తల్లిని మభ్యపెట్టి, ఆమె ఇచ్చిన డబ్బుతో కాశీకి వెళ్ళిపోయాడు. కాశీ నుంచి హరిద్వారం వెళ్ళాడు. అక్కడ నుంచి మరి 200 మైళ్ళు నడచి బ్రహ్మకపాళం వెళ్ళి వచ్చాడు. 17, 18 సం॥లలో చిరుత ప్రాయంలోనే 400 మైళ్ళు నడిచి బ్రహ్మకపాళం వెళ్ళి వచ్చిన రామరాజు పట్టుదల ఎంతమందిలో చూడగలం! కృష్ణదేవి పేట దగ్గరలోనే ధారకొండకు బాలయోగిగా సీతారామరాజు తిరిగి వచ్చాడు.

సీతారామరాజు జీవితంలో క్షణమైనా స్థాయి, హాయి లేవు. తండ్రి మరణం తర్వాత అనుక్షణం జీవిత పోరాటమే ! అతనిలో ఏదో తెలియని అసంతృప్తి. మరేదో సాధించాలన్న తపన. వీటి మధ్య రాజు బాల్యం నలిగిపోయింది. అందరి బాల్యాల్లాగా ఆయన బాల్యం కూడా అందాల హరివిల్లు అయివుంటే, మనం ఈనాడు అనుకునే అల్లూరి సీతారామరాజు రూపుదిద్దుకొనేవాడేనంటారా? మన్య ప్రజల ఆశాకిరణమై మన గలిగేవాడా? తెలుగు వెలుగుగా హారతులందుకొనేవాడా? ఒక్కసారి ఆగి ఆలోచించండి.

"మానవ శరీరములు శాశ్వతములుగావు
కానీ కీర్తి, అపకీర్తి శాశ్వతములు.
మంచి, చెడ్డలు చిరకాలం నిలుస్తాయి
క్షత్రియులకు యుద్ధము సహజము"

-అల్లూరి సీతారామరాజు.

## రచయితలకు విజ్ఞప్తి

ఇది విప్లవవీరుడూ, ఆంధ్రుల స్వాతంత్రేచ్ఛకు ప్రతీకయైన అల్లూరి సీతారామరాజు శతజయంతి సంవత్సరం. పునర్వలసీకరణ కారుమబ్బులు కమ్ముతున్నవేళ అల్లూరి శతజయంతిని మనం జరుపుకుంటున్నాం.

అల్లూరి కొనసాగించిన గిరిజన రైతాంగ ఉద్యమాలు, సాంప్రదాయక హక్కులకై వారి పోరాటాలు యింకా సాగుతూనే వున్నాయి. భారతదేశం నిజమైన స్వాతంత్ర్యాన్ని యింకా పొందవలసి వుంది. సామ్రాజ్యవాదం తిరిగి సమస్త రంగాలలోకి చొచ్చుకుపోతోంది :

ఈ నేపథ్యంలో అల్లూరి సీతారామరాజుపై విభిన్న కోణాలలో సరికొత్త వ్యాసాలూ, కవితలూ, పాటలూ, కళారూపాలనూ - గతంలో ప్రచురింపబడిన వాటిపై విశ్లేషణలనూ ప్రజాసాహితి ఆహ్వానిస్తోంది. ఈ సంవత్సరమంతా ప్రతి నెలా ఏదో ఒక అంశంపై అల్లూరి గురించి ప్రచురించాలని సంపాదకవర్గం నిర్ణయించింది. సూచనప్రాయంగా కొన్ని శీర్షికలను పేర్కొంటున్నాం.

1. గిరిజనోద్యమాలు - అల్లూరి సీతారామరాజు.
2. భారత స్వాతంత్ర్య పోరాటంలో అల్లూరి.
3. మోప్లా రైతాంగ తిరుగుబాటు - 1921 - తులనాత్మక పరిశీలన
   మన్యం తిరుగుబాటు (1922-24) - తులనాత్మక పరిశీలన
4. సీతారామరాజు బుర్రకథ - సుంకర సత్యనారాయణ
   సాహిత్య కళా విశ్లేషణ
5. వివిధ కళారూపాలలో మన్యం పోరాటం
6. సీతారామరాజుపై వివిధ గ్రంథాలు
   చారిత్రక వాస్తవాలు - వక్రీకరణలు
7. అల్లూరి సీతారామరాజు - ఉమర్ ముక్తార్
   సినిమాల తులనాత్మక పరిశీలన
8. అల్లూరి వారసత్వం - మన కర్తవ్యం

ఇంకా విభిన్న కోణాల నుండి వివిధ సాహితీ ప్రక్రియలలో రచనలు అందించవలసిందిగా కోరుతున్నాం.

- ప్రజాసాహితి సంపాదక వర్గం

# తేదీ 27.05.1996న హరిపురం (ఉద్దానం)లో జరిగిన కా॥ మార్పు పద్మనాభం 'తాత' శతజయంతి సభ : జనసాహితి సందేశం

మార్పు 'తాత' శతజయంతి ఉత్సవాలకు అతనితో సహా అతని సహచర అమరులందరూ అతిథులుగా వచ్చి ఉంటారు. చిరస్మరణీయులైన అతిథులకు స్వాగతం. వేదికనలంకరించిన పెద్దలకూ, జ్ఞాతంగానో అజ్ఞాతంగానో ఉత్సవ సందర్భాన్నీ సందడిని అందుకోవాలనే స్ఫూర్తితో వచ్చిన విప్లవ కారులందరికీ అభినందనలు. నిజమైన వీరులూ, నిర్మాతలూ, సర్వశక్తి సంపన్నులూ, ఉత్పత్తి శక్తులైన ప్రజలందరికీ వినమ్రతతో నమస్కరిస్తున్నాను. భవిష్యత్తుకు వేగుచుక్కలు యువకులు, బాలలు-చిరంజీవులు, వారికి సుస్వాగతం.

ఉజ్వల భూఖండమిది. పేరుకు ఉద్దానం. ఈభూఖండం మీద సూర్యుడుదయిస్తాడే తప్ప అస్తమించడు. ఉదయభానుని ప్రయాణాన్నీ పెరుగుదలను నడినెత్తి పొద్దు దగ్గర పశ్చిమానికి వాలనివ్వకుండా అడ్డుకొంటుంది. మహేంద్రగిరి శిఖరం,. ఇక్కడి కారు చీకటిని కాల్చివెయ్యాలనే తపన కనురెప్పలను వాల్చనివ్వదు. ఈ ప్రజల ధృడసంకల్పం, అటు కోణార్క్‌లోను ఇటు అరసవిల్లిలోను సూర్యుణ్ని రెండు బింబాలుగా స్తంభింపజేసింది. చీకటినుండి వెలుతురు లోనికి కానేకాదు. - వెలుతురు నుండి చైతన్యంలోనికి, చైతన్యంలో నుండి కమ్మని స్వప్నంలోనికీ, మరణాతీతగుణమైన ఆశలోనికి పయనించే గుణాత్మకత గల భౌతిక స్వరూపమున్న భూభాగమిది. ముందు సముద్రం, వెనుక కనుమ. జలాశిలాలోతీత ప్రాంతమిది. కడుపు కొట్టే వాడినీ, హృదయమిచ్చేవాడిని పట్టివదలదు. చచ్చేంతవరకు శత్రువుని ద్వేషిస్తుంది. మిత్రుల్ని ప్రేమించి చస్తుంది ఉద్దానం.

మ్యాపులో ఉద్దానం రూపు చూడండి. తప్పిపోకండని వేలెత్తి చూపే చేతిలా వుంటుంది. ఆధునిక దృష్టితో, అది తూర్పుకనుమ కుడిచేతిలో గురిపెట్టి వున్న గెరిల్లా బారుతుపాకీ లాంటి భౌగోళిక రూపం. విప్లవనైజంతో నున్న నైసర్గిక తాపమది. ఎడమ పక్కటెముక శిలపై, కుడిపక్కటెముక అలపై ఆన్చి రంగమెటియా బారికేడ్ల వెనుక బోర్లపడి గురిచూస్తున్న ప్రతిఘటనా పోరాటయోధుడిలా వుంటుంది ఉద్దానం ఆకారం.

క్రీస్తుపూర్వం మౌర్య సామ్రాజ్యవాదుల దండయాత్రకు గురయ్యిందీ భూభాగం. చక్రవర్తుల సైన్యాలతో భీకరయుద్ధం చేసారీ ప్రజలు. రక్తతర్పణ మొట్టమొదటి సారిగా జరిగిపోయింది. యుద్ధ రథచక్రాల తొక్కిసలాటలో ఎముకలు పెళపెళా విరిగి పోయాయి. మట్టిని రక్షించుకోవాలనే తపనతో, అందరు సామాన్య ప్రజలు! ఎందుకంత వీరత్వం ప్రదర్శించారో అర్థం కాలేదు అప్పటి అశోక చక్రవర్తికీ, ఇప్పటి మానవ చరిత్రకారులకీ, కళింగ యుద్ధభూమిలో ప్రజావీరులు విరిచి పోగుపెట్టి విసిరేసిన చక్రవర్తి రథచక్రాన్ని పైకెత్తి, ఆ చక్రంపైనున్న ప్రజల రక్తాన్ని పాలక వర్గాలు తమకన్నీటితో తుడిచి ధర్మచక్రంగా ప్రతిష్టించారు. కళింగ ప్రజల ముత్తాతలు తమ కళేబరాల అమృతసారాన్ని ఈ మట్టి పై పారలకందిచ్చి కంకాళాలకు శిలజాల రూపిచ్చి కిందిపొరలలో యిమిడిపోయారు. తవ్వి చూడండి. మట్టిగొట్టుకు పోయిన ఎముకలలలోని భాస్వరం భగ్గున మండుతుంది. పిడచగట్టుకు పోయిన మూలుగులోని రక్తం మందు పాతర్లయి పేలుతుంది.

కళింగయుద్ధానంతరం ఈ మరుభూమిలో శతాబ్దాల తరబడి మొక్క మొలవలేదు. మెల్లమెల్లగా మూలుగుల్లోంచి మనుషులు మొలకెత్తారు. ఆ తర్వాత, ఆనాడు తుళ్ళిన కపాలలాలోంచి క్రమంగా కొబ్బరులు లేచాయి. మృతుల రక్తపు మడుగుల్లోంచి జీళ్ళు, వారి దరహాసాల మరకలలోంచి పనసలూ, వారి తెగిపోయిన చేతివేళ్ళనుంచి మునగలూ కాచాయి. డబరు, ఇంద్రగిరుల చనుబాలు సునాముది జక్కరులై మహేంద్రతనయ ఏరులై ప్రవహించి, యుద్ధానల ప్రదేశమంటలను చల్లబరచి ఉద్ధానాన్ని పోషించాయి. జీవితం క్రీస్తుశకంలో పునరుద్ధరింపబడిందాకా ఎవరి జోక్యమూ కనబడదు. వర్షం కురిసింది. గాలి వీచింది. వెలుతురు పరచింది. కళింగసముద్రం తీరరేఖను మీటుతూ స్వరాన్ని అందించింది. మెరుపులలాలిలో ఉరుము ఊసుల కళింగ యుద్ధానం ఉద్ధానమయ్యింది.

మౌర్యసామ్రాజ్యం పతనమయ్యింది. క్రీస్తుశకం 900వరకు ఈ ప్రదేశం స్థానికులైన ఒక తూర్పుగంగ శాఖ రాజవంశాలు పాలించాయి. ఫ్యూడల్ ప్రభువుల పేరున పాలన ఆరంభమయ్యింది. ఓఢ్రదేశపు సోమవంశ రాజుల దండయాత్రలకు మరొకసారి గురయ్యింది ఈ ప్రదేశం. మరో తూర్పు గంగ రాజవంశ చక్రవర్తి అనంతవర్మ చోడగంగుడు సోమవంశరాజులను ఓడించి ఉత్కళ రాజ్యం స్థాపించాడు. కళింగదేశం పడమర సరిహద్దులోనున్న కళింగనగరం (శ్రీముఖలింగం) రాజధానిగా తూర్పుగంగ రాజవంశాలు 15వ శతాబ్దం వరకు పాలనసాగించారు. అశోకమౌర్యుడు నిర్మించిన నూరు అడుగుల బౌద్ధస్తూపం గల శాలిహుండాం గంగరాజుల కాలంలో ధాన్యం మార్కెట్టు (శాలిపేటిక వరిసం) గానూ, కళింగ పట్టణం ఓడరేవుగానూ ఉండేది.

ఆర్య, మౌర్య,సోమ,చోడ, రాజవంశాల పదఘట్టనతో శ్రామిక రైతాంగ ప్రజానీకం రచనతో శోభిల్లిన కళింగ ప్రదేశ ప్రజాజీవితం దపదపాలుగా చితికిపోయింది. ఈ ప్రదేశంలో జరిగిన దండయాత్రలను ఇక్కడ ప్రజలు శక్తివంతగా ప్రతిఘటించారు. ఈ ప్రతిఘటనలను దాటి దక్షిణాదికి ఏ సామ్రాజ్యమూ విస్తరించలేకపోవడం గమనిస్తే ఆనాటి కళింగ ప్రజానీకం శక్తి శౌర్య సామర్థ్యాలకు అబ్బురపడక తప్పదు. మొగల్ సామ్రాజ్యఛాయలు చికాకోల్ దాటి కళింగదేశంలో కనుమరుగై పోవడం మరో విశేషం. చారిత్రకాంశాలు యింకా చర్చించాల్సి ఉన్నా ఈ ప్రజల ప్రతిఘటనా సామర్థ్యాన్ని గుర్తించు కోవలసి ఉంది.

17వ శతాబ్దంలో ఈస్టిండియా కంపెనీ ముఖంతో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు బెంగాల్‌లో ప్రవేశించారు. ఉద్ధానానికి ఎగువనున్న ఉత్కళ తల భాగాన కంపెనీ తిష్ట వేసింది. అది బ్రిటిష్ పాలకవర్గంగా మారింది. ఫ్యూడల్ ప్రభు వర్గాలను, జమీందారులను తన మోచేతి కిందికి లాక్కొంది. క్రమంగా భారత ఉపఖండాన్ని చుట్టివేసింది. ప్రకృతివనరులను దోచుకునేందుకూ, పరిపాలన సాగించేందుకు పథకాలు వేసింది. కారుచౌకగా లభించే మానవ వనరులనుపయోగించుకొని నేషనల్ హైవే, రైలు మార్గాలను ఉద్ధానం మీది నుండి మద్రాసు వైపుకు ఉద్ధరించింది. బంగాళాఖాతంలో ఓడలు నడిపింది. అద్భుతంగా, ఆశావహంగా కనబడుతున్న ఆంగ్లేయుల విస్తరణ తమ మట్టిపైనుండి ఎంత భారీ ఎత్తున సాగుతున్నా అంగీకరించింది ఉద్ధానం తొలిసారిగా. సుదీర్ఘమైన అనుభవాల సారంలోంచి బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పాలనలోని రాక్షసపీడను ప్రతిఘటించి విముక్తి పోరాటాలు నిర్వహించాల్సిన

అవసరం ద్యోతకమయ్యింది. కళింగసీమ ఉద్యమించింది. బ్రిటిష్ పాలకవర్గాలను తరిమికొట్టే ఉద్యమాల ఊపందుకుంటూనే, స్థానికంగా సామ్రాజ్యవాదుల తాబేదారులైన స్థానిక జమిందారులపై పోరాటాలు సాగించింది ప్రజానీకం. ఉద్దానం నుండి రైతులు ఉవ్వెత్తున లేచారు. మద్రాసుకు పాదయాత్రలు చేసారు. రైతుల హక్కులకోసం, భూమికోసం సాగేపోరాటాలలో ఖద్దరు, ఉచ్చులు బిగించింది. ఉరితాళ్ళు వేలాడదీసింది. ఉద్దానం ఖద్దరును విసర్జించింది. ఖద్దరు గుడ్డలను తమ ఎర్రమట్టిలో యింకివున్న ముందుతరాల రక్తధాతువులలో గుంజి, హిమోగ్లోబిన్ అద్దకంచేసి, ఎగరేసింది. గుణాత్మకమైన "మార్పు" నాయకత్వానికి వచ్చింది. గవరయ్య తాతను, తరుణాచారిని చూసి ఎగిసి ఎగిసి ఎర్రెర్రనయింది జెండా, రైతు ఉద్యమ చరిత్రలో తొలిసారిగా నేలకొరిగిన వీరగున్నమ్మ నెత్తురెత్తుకొని, ఎగిరి గర్వపడింది ఎర్రజండా,ఉద్దానం ఉత్తరాంధ్రయి విస్తరించింది. నాగావళీ వంశధారలను నాళాలుగా జేసుకుంది. గుమ్మనుండి రంగమెటియా వరకు బారసాచింది. జలధి మృదంగాన్ని మోదింది. తారరేఖను మీటి నెత్తురు నేపథ్యాన్నిఆలాపించింది. ఇదంతా అస్వతంత్రులుగా ఉన్నపుడు, మన నల్లదొరల కనుసన్నలలో ఈ శతాబ్దాన నలభైలలో జరిగింది.

పరాధీన స్వాతంత్ర్య పాలనలో దోపిడీ పాలకవర్గాల 23 ఏళ్ళ పాలనలో గిరిజనులూ, బీదరైతులు కూలీలు తీవ్రమైన దారిద్ర్యాన్ని దోపిడీని పీడనలను ఒకేసారి అనుభవించాల్సి వచ్చింది. సాంప్రదాయక ఆయుధాలు పైకెత్తి ప్రతిఘటనా పోరాటాలకు ఉరకెత్తవలసిన సమయాన్ని మించి, ట్రిగర్‌ను లాగింది ఉద్దానం. మోగుతున్న జముకు బద్దలయ్యింది. విప్లవ స్వరపేటికలు తెగిపోయాయి. రాజ్యహింస పెట్రేగిపోయింది. మళ్ళీ ఉద్దానం రక్తపంకిలమయ్యింది. జరగవలసింది జరగలేదు. జరగకూడనిది జరిగిపోయింది ! ఎలా?!

దేశం చరిత్రను తడిమిచూసిని జరిగిపోయినా చెడే ఎక్కువగా దొరుకుతుంది. గతంలో మంచి కొంచెమే జరిగింది. మంచిని సమీక్షించుకునే తీరుబడి మనకుండ కూడదు.

ఉద్దానం మంచి చెడ్డలను మదింపు చేసుకోవాలి. గుణపాఠాలను యువతరానికి అందివ్వాలి, ఉద్దానం గత చరిత్రలో జరిగిన మంచిలో - మార్పు పద్మనాభం తాత ఉద్యమ జీవితకాలం విప్లవమార్గానికొక తొలి మైలురాయి. ఉద్దానం చరిత్ర అతి తక్కువగా దొరుకుతోంది. చరిత్ర పరిశోధకులకు చేయూత నివ్వాలీ ప్రజలు. చారిత్రాత్మకమైన పోరాటాలకు పురిటిగడ్డ ఉద్దానమని తెలుస్తోంది. అదిచాలదు. భావి విప్లవచరిత్రకు పునాది చరిత్రను ఉద్దానం అందివ్వాలి. 'మార్పు' తాత శతజయంతి ఉత్సవం అందుకు తొలిమెట్టునందిస్తుందని భావిస్తాను. ఎంతో ఉత్సాహాన్ని అందించే ఈ సభ నిర్వహణ కమిటీకి, ప్రత్యేకించి ఉద్దానం ప్రజానీకానికి ధన్యవాదాలు తెలుపుతున్నాను. అమరులైన విప్లవకారులందరూ చిరంజీవులే! చిరస్మరణీయులే. వారందరికీ నా శ్రద్ధాంజలి.

*లాల్ సలాం కా॥ 'మార్పు' తాతకు!*
*లాల్ సలాం కా॥ 'గవరయ్య' తాతకు!*
*లాల్ సలాం కా॥ తరుణాచారికి!*
*లాల్ సలాం కా॥ వీర గున్నమ్మకు!*
*లాల్‌సలాం శ్రీకాకుళ పోరాట అమరవీరులకు !!*

27.05.1996.



# "మార్పుకోసం"పరిచయ సభ -జనసాహితి, శ్రీకాకుళం శాఖ

**జా**తిని రోగగ్రస్థం చేస్తున్న ప్రధాన కారకాలలో సామ్రాజ్యవాద సాంస్కృతికదాడి చాలా ప్రమాదకరంగా వుందని; దీని నుండి బయటపడే మార్గాల్ని మనంతంటమనమే కనుక్కోవాలని; లేదా జాతిముందుకు నడవదని-స్థానిక టౌన్‌హాల్‌లో జనసాహితి నిర్వహించిన "మార్పుకోసం' ' సంస్మరణసంచిక పరిచయసభలో ఒ.పి.డి.ఆర్. రాష్ట్ర అధ్యక్షులు శ్రీ టి.ఎల్.నారాయణగారు ముఖ్యఅతిధిగా పాల్గొని అన్నారు. ఇంకా ఉద్యమం ఎక్కడుంటుందో-దాని నుండి ప్రేరణతో సాహిత్యం కూడా వస్తుంది. అటువంటి సాహిత్యాన్ని భద్రపరుచుకోవాలని, ప్రజల్లోకి తీసుకుపోవాలని పిలుపునిచ్చారు. ప్రజల శ్రమ ప్రజలకు దక్కనంతకాలం తిరుగుబాట్లు జరుగుతూనే వుంటాయని పురాణసాహిత్యాల నుండి, చారిత్రక సంఘటనల నుండి ఉదాహరణలను చూపించారు. వ్యష్టికి, సమిష్టికి సమతుల్యాన్ని సాధించిన సమాజమే ఉన్నత మైనదని, సమాజానికి సాహితీసంస్థలు ప్రేరణనిస్తాయని, అంటూ శ్రీకాకుళానికి పోరాట చరిత్ర వుందని, అది ప్రేరణనిస్తుందని శ్రీకాకుళ ఉద్యమం ఇచ్చే స్ఫూర్తిని వివరించారు. మేధావులు ప్రజలకు జరిగే అన్యాయాలను ఎదిరించి నిలబడకపోతే- ఆ ప్రజలు నిలబెట్టి అడిగే రోజొకటి వచ్చితీరుతుందని అన్నారు. సామ్రాజ్యవాదసంస్కృతి లాభనష్టాలనే భేరీజువేసుకుంటూ ఈనాటి మనల్నేకాదు, రేపటి పిల్లల భవిష్యత్తును అంధకారంలోకి నెట్టేసే ప్రమాదాన్ని మనం గుర్తించి, ఎదిరించాలని పిలుపునిచ్చారు. భూస్వామ్య, దళారీ, సామ్రాజ్యవాదాలకు వ్యతిరేకంగా ఐక్యసంఘటనద్వారా పోరాడాల్సిన కీలకమైన పరిస్థితిలో మనం వున్నామన్నది గుర్తించాలి హక్కులనేవి ప్రజలు పోరాడి సాధించుకున్నవేకానీ, ఎవరో ఇచ్చినవికావని, అందుకే ప్రజల ప్రజాస్వామిక,పౌరహక్కులరక్షణకోసం అందరం ఉద్యమించాలని పిలుపునిచ్చారు. స్వాతంత్ర్య సమరయోధుడు, తొలితరం శ్రీకాకుళం కమ్యూనిస్టు నాయకుడు, రైతు ఉద్యమ నాయకుడు కామ్రేడ్ మార్పుపద్మనాభ శతజయంతి సందర్భంగావిడుదల చేసిన "మార్పుకోసం" సంస్మరణసంచికను పరిచయంచేస్తూ జనసాహితి రాష్ట్రకార్యవర్గ సభ్యుడు, కవి-ఛాయరాజ్ మాట్లాడుతూ మార్పుచలనానికి పురోగమనానికి సంకేతమని, గత తార్కికమైనదనీ, మనిషి అభివృద్ధికోసం చేసే పోరాటాలు ఆ మార్పు కోసమేననీ; ఆ పోరాటాలలో పాల్గొన్నవారిని మరచిపోవద్దని, మన కుటుంబ సభ్యులను గుర్తుంచుకునేంతగా గుర్తుంచుకోవాలని-జూలియస్ ఫ్యూజిక్ మాటల్ని ముందు పేజీల్లో ప్రచురించడం సముచితంగా వుందని అన్నారు. మార్పు పద్మనాభం గారు-ప్రజల్నే తన కుటుంబంగా భావించారు. భారత విప్లవోద్యమానికి దిక్సూచిగా తరిమెలనాగిరెడ్డి నిలిచారని; పెన్నుగన్నూ పట్టి పాణిగ్రాహి, విప్లవ సాహితీ సాంస్కృతికోద్యమానికి స్ఫూర్తినిచ్చారు అన్నారు. ప్రజా ఉద్యమాలు ముందుకు పోలేనంతవరకూ, ఉద్యమసాహిత్యం ముందుకుపోదు-ఉద్యమంతో సంబంధం లేని సాహిత్యం పురోగమించదు. పరిణామక్రమంలో వ్యక్తులు కనిపించలేదు-సమాజం మిగిలింది. సామ్రాజ్యవాద సంస్కృతి ఆ సమాజాన్ని వ్యక్తులుగా విడగొట్టి-పతనానికి లాగేస్తోంది-ఇది చాలా అప్రమత్తంగా మనం గమనంలోకి తీసుకొని ఈ దారుణాన్ని ఎదిరించాలనే "మార్పుకోసం"మనం ఉద్యమించాలని అన్నారు.

ఒ.పి.డి.ఆర్ జిల్లా నాయకులు శ్రీ బార్ల చిరంజీవులుగారు మాట్లాడుతూ ఆర్థిక, సాంఘిక, రాజకీయ సంక్షోభాలు ఒకవైపు, కార్మిక, విద్యారంగ, రైతాంగ పోరాటాలు మరోవైపు ఉన్న పరిస్థితిలో రాజ్యహింస కొనసాగాల్సిన అవసరం వుందా? అంటూ సామాజిక "మార్పుకోసం" కృషిచేయాలని కోరారు. మార్పు సీతారామయ్యగారు మాట్లాడుతూ తాను మార్పు శతజయంతి కమిటీ అధ్యక్షులుగా పనిచేసిన కాలంనాటి అనుభవాలను వివరిస్తూ - పాలక వర్గాలు సామ్రాజ్య వాదుల చేతిలో కీలుబొమ్మలుగా వున్నారని, వాళ్ళ ప్రజావ్యతిరేక విధానాల్ని ఎదిరించడాన్కి ఐక్యవేదిక అవిర్భావ అవసరాన్ని నొక్కిచెప్పారు.

మార్పుకమిటీ ఉపాధ్యక్షులు శ్రీఎరుకు నాయుడు గారు మాట్లాడుతూ జనం సమస్యల్ని పట్టించుకోని ఏ సంస్థా ముందుకు సాగదని, సామాజిక "మార్పుకోసం" పనిచేయాలని చెప్పారు.

జనసాహితి సభ్యుడు నాగరాజు మాట్లాడుతూ - ఆనాటి పోరాటాల స్ఫూర్తిని - ఈనాడు ఈ సంక్షోభాల వ్యవస్థని బ్రద్దలు చేసే ఒక అనివార్యమైన కర్తవ్యం మనముందు ఉందని; పాల కులు తమ విధానాలతో ప్రజల్ని మానసిక వైకల్యానికి గురి చేస్తున్నారని, అందుకే మేధావులు ప్రజల పక్షాన నిల్చి చైతన్యాన్ని అందించి, సామాజిక 'మార్పుకోసం' కృషిచేయాలని అన్నారు.

విరసం సభ్యుడు కథా రచయిత అప్పల్నాయుడు మాట్లాడుతూ శ్రీకాకుళానికి ఒక చారిత్రిక ఉద్యమ పునాది వుందని, ఉద్యమమే కవులూ, కళాకరులూ రావడానికి భూమిక అని, కలవవలసిన శక్తుల మధ్య పెద్ద భేదం లేని నేడు అవి ఏకం అవ్వాల్సిన అవసరమూ వుంది; అభ్యంతరమూ లేదని అన్నారు.

విలేకరుల సంఘం అధ్యక్షుడు నల్లి ధర్మారావు మాట్లాడుతూ మార్పు సంచిక ఒక విలువైన సమాచారాన్ని అందిస్తోందని అన్నారు.

"మార్పు కోసం" సంస్మరణ సంచిక సంపాదకుడు, కవి,జనసాహితి సభ్యుడు సన్నశెట్టి శేఖర్ మాట్లాడుతూ - వ్యక్తిగా పోరాడితే ఏం సాధించలేమని, పోరాట సంస్థలో పాల్గొనాలని, ఉద్యమాలు లేకుండా వ్యక్తులుగా వికసించలేరని, ఆత్మ పరిశీలనతో - ముందుకు పోవాలని అన్నారు. సంచిక తీసుకు రావడంలో ఎదురైన ఊపుతాపుల్ని పోత్సాహాల్ని నిరుత్సాహాల్ని - ఒక్కలాగే తీసుకోవడం వల్ల రెట్టించిన పట్టుదలతో - ఈసంచికను - జాగురకతకతో తీసుకు రాగలిగినా-కొన్ని పొరపాట్లు జరిగాయని-ఈ కృషికి సహకరించిన అందరికీ కృతజ్ఞతలుతెలిపారు.

సభకు అధ్యక్షత వహించిన జనసాహితి సభ్యుడు శ్రీ.కె.భానుమూర్తి ఆనాటి మార్పు స్ఫూర్తిని అందిస్తూ ఈనాటి సామ్రాజ్యవాద సంస్కృతీ వికృతస్వరూపాన్ని సోదాహరణంగా వివరించి - సభను జయప్రదంగా నడిపించారు.

జనసాహితి సభ్యుడు శ్రీ.కె.పాపారావు సభకు స్వాగతం పలకడం,వందనసమర్పణ చేసారు.

## విప్లవ కళాకారిణి కామ్రేడ్ కుమారి జోహార్లు

విప్లవ సాహిత్య కళాభిమానులు కె.పి. సుబ్బారావుగారి ఇంట్లో జరిగిన సంస్మరణ సమావేశంలో జననాట్యమండలి కళాకారిణి కామ్రేడ్ కుమారి అకాల మృతికి ఆ సమావేశంలో పాల్గొన్న వి.ర.సం. జననాట్యమండలి, తదితర సంస్థలు, వ్యక్తులతోపాటు జనసాహితి తరుపున నిర్మలా నంద, అరుణోదయ తరుపున రామారావులు జోహార్లు తెలిపారు. "కుమారి మరణం మొత్తం విప్లవ సాంస్కృతిక రంగానికి తీరని లోటు" అని నిర్మలానంద అన్నారు.

## విజయవాడలో మర్రివాడ వర్ధంతి సభలో

ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ (ఎ.పి.టి.ఎఫ్) తన రాష్ట్ర కార్యదర్శి "మర్రివాడ గోపాలకృష్ణమూర్తి సంస్మరణ సభను కాకాని టీచర్స్ గిల్డ్ హోంలో నిర్వహించింది. ఎ.పి.టి.ఎఫ్. నాయకులు సోదర సంస్థలు పాల్గొన్న ఆనాటి సభలో జనసాహితి రాష్ట్రనాయకులు, ప్రజాసాహితి వర్కింగ్ ఎడిటర్ నిర్మలానంద, "మర్రివాడ జనసాహితికి ఎంతో సన్నిహితుడు. ఆయన సారధ్యాన ఆహ్వాన సంఘంగా జనసాహితి 5వ రాష్ట్ర మహాసభలు విజయవంతంగా జరిగాయి. ఒక విలువైన ఉద్యమనేతను ప్రజా ఉద్యమాల సన్నిహితుణ్ణి కోల్పోయామ"ని అన్నారు. అరుణోదయ రాష్ట్ర కార్యదర్శి ఉదయ్ "అరుణోదయ కళారూపాలకు చక్కటి కళావిమర్శకుడు మంచి ప్రేక్షకుడిగా మర్రివాడను మరువలేకున్నామ"ని అన్నారు. ఉదయ్ రాసిన "ఉపాధ్యాయ ఉద్యమ సూరీడా-మామంచి మాస్టారు మర్రివాడా" పాట ఉదయ్ అనూరాధలు పాడి తమ జోహార్లు తెలిపారు.

## ఓ.పి.డి.ఆర్. రాష్ట్ర మహాసభలలో అరుణోదయ

జూన్ 1,2 తేదీలలో హైదరాబాద్, అంబేద్కర్‌భవన్‌లో జరిగిన ఒ.పి.డి.ఆర్. 11వ రాష్ట్ర మహాసభలలో అరుణోదయ, నల్లగొండ సాంస్కృతిక దళం చురుగ్గా పాల్గొని అనేక పాటల్ని పాడి విన్పించారు. వందలాదిగా ప్రదర్శనలు ఇచ్చిన "కరువుబతుకులు" వీధి నాటకాన్ని ఒ.పి.డి.ఆర్. ప్రతినిధుల ముందు ప్రదర్శించారు. జర్నలిస్టులపై దాడులు, రైతాంగ, ప్రజా ఉద్యమాలపై దాడులను ప్రజా స్వామిక హక్కులను హరించి వేస్తున్న తీరుపై నల్లగొండ అరుణోదయ కళాకారులు సమిష్టిగా మరో కొత్త వీధినాటిక "రాజ్యహింస" రూపొందించి ఓ.పి.డి.ఆర్ సభల రెండవ రోజు ప్రదర్శించారు. నాటికల ప్రదర్శన అనంతరం ప్రేక్షకుల అభిప్రాయ వేదికలో అనేక విలువైన సూచనలు ఇచ్చారు.

విజయవాడలో జూన్ 7వ తేదీన జరిగిన ఓ.పి.డి.ఆర్ కృష్ణాజిల్లా మహాసభను జనసాహితి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబు ప్రారంభిస్తూ తమ ఉపన్యాసంలో ఈ దేశంలో ప్రజాస్వామ్యం ఒక గొప్ప అబద్ధంగా వుందన్నారు.

**సంతాపం**

## విప్లవ కళాకారిణి కామ్రేడ్ కుమారికి జోహార్లు

బాల్యం నుండీ విప్లవ కళారంగమే తన ఆటగా, పాటగా చేసుకుని 26 సం॥ల చిన్న వయస్సులోనే అనారోగ్యంతో మరణించిన జననాట్యమండలి కళాకారిణి కా॥ కుమారికి అరుణోదయ జోహార్లు చెబుతోంది. మహిళలంటే అంగట్లో సరుకులా, పురుషాధిక్యతకు అణిగిమణిగి పడి వుండి పిల్లల్ని కనే యంత్రంలా రూపుదిద్దుతున్న అర్ధ వలస-అర్ధ ఫ్యూడల్ దోపిడీ వ్యవస్థను సవాలు చేస్తూ గజ్జె కట్టి, డప్పు పట్టి ఆడి, పాడి నిజమైన విప్లవ కళాకారిణి కా॥ కుమారి నిలబడింది. భూమి కోసం, భుక్తికోసం, విముక్తి కోసం అసంఖ్యాక శ్రామిక జనం సాగిస్తున్న పోరాటాలతో మహిళా ఉద్యమాలు మమేకం అయితే తప్ప నిజమైన స్త్రీ విముక్తి సాధ్యం కాదనే సత్యాన్ని ఎలుగెత్తి చాటింది. కా॥ కుమారి ఆశయాలను సాధించే కృషిని మరింత మొక్కవోని దీక్షతో కృషి సల్పటమే ఆమెకు నిజమైన నివాళి. ఆమె కుటుంబసభ్యులకు అరుణోదయ ప్రగాఢ సంతాపాన్ని ప్రకటిస్తోంది.

దివికుమార్
రాష్ట్ర అధ్యక్షుడు
అరుణోదయ

ఉయ్యూరు, 20-6-96



# ఉత్తరాలు



ప్రజాసాహితి చిరస్మరణీయులైన పెద్దల జీవితాల్నీ కృషినీ తరువాతి తరాలకి గుర్తు చేస్తూ తెచ్చిన ప్రత్యేక సంచికల్లో ప్రత్యేకంగా వుంది లక్ష్మీకాంతమోహన్ మీద తెచ్చిన ప్రత్యేక సంచిక.

ఇంతవరకూ చరితార్థులై చరిత్ర సృష్టించి ఏదోరూపంలో భావితరాలకి స్ఫూర్తి నిచ్చిన పెద్దల జీవితాల్నీ, చైతన్యవంతమైన వారి కృషిని పరిచయంచేశాయి. "ప్రజాసాహితి" ప్రత్యేక సంచికలు. ఇది తద్భిన్నంగా చరిత్ర వెలుగు ప్రసరించక చీకటి కోణాల్లో చిక్కుకు పోయి అనామకంగా జీవితాన్ని గడిపి చివరికి కన్నుమూసిన కళాకారుని జీవితాన్ని కృషిని పరిచయం చేసింది.

లక్ష్మీకాంతమోహన్ జీవితాన్ని కృషిని చదివిన వారికి పోరాటశీలమైన ప్రాపంచిక దృక్పథంలో ప్రారంభమై బహుముఖాల కృషి చేసిన వ్యక్తి, ప్రజాకళాకారుడు, హరీంద్రనాథ చటోపాధ్యాయ చేత మన్ననలందినవాడు, క్రమక్రమంగా ఆ వైఖరి నుంచి వెనక్కి ప్రయాణం చేసి చివరికి తనని తాను 'షెక్స్‌పియర్ మోహన్'గా పిల్చుకునే పరిస్థితికి నెట్టబడ్డాడు. ఇందుకు ఆయన జీవితకాలంలో తెలుగునేల మీద నెలకొని వున్న పరిస్థితుల బాధ్యతెంత? స్వయంకృతమైన ఆయన బాధ్యతెంత? అనిపిస్తుంది.

ఈ సంచికలోని ఓ వ్యాసంలో జయధీర్ తిరుమలరావుగారన్నట్లుగా తెలుగునేల లక్ష్మీకాంత మోహన్ని నిర్లక్ష్యం చేసిందా? లక్ష్మీకాంత మోహన్ ప్రజల్ని నిర్లక్ష్యం చేశాడా? లక్ష్య, నిర్లక్ష్యాలు రెండింటికీ వ్యక్తికున్న బలమైన వ్యవస్థదే ప్రధాన బాధ్యత. దుర్భరదారిద్ర్యాన్ని గుర్తించని దోషం తెలుగునేలదైతే. అది గుర్తించరాదు గనక ప్రజల్ని నిర్లక్ష్యం చేసే స్థితికి వెళ్ళడం, వ్యక్తిగా ఆయన దోషం! అలా ప్రజల్ని నిర్లక్ష్యం చేయకుండా వుంటే లక్ష్మీకాంతమోహన్ మాక్సింగోర్కీకి తెలుగువారసుడిగా ఎదిగే వాడేమో! వ్యక్తిగా ఆయన్నించి అనివార్యంగా దొర్లిన ఈతన్ని షేక్స్‌పియర్ మోహన్ని చేసింది! ఇక్కడ మనం గుర్తించాల్సింది షేక్స్‌పియర్ కూడా బూర్జువా ప్రాపంచిక దృక్పథ పరిమితుల్లో ప్రజల పక్షాన నిల్చిన జీవిత సత్యాన్ని వెలిబుచ్చిన రచయితేనని. అంచేత లక్ష్మీకాంతమోహన్ జీవన వైఖరికి సంబంధించి, వెనక ప్రయాణమే అయినా గర్హించదగినదీ, అనారోగ్యకరమైనది కాదనీ కాస్త ఆలోచిస్తే అర్థమవుతుంది.

కనక నా కనిపిస్తున్నదేమిటంటే చరిత్రకాంతి ప్రసరించి చరిత్ర చేత గుర్తించబడిన చరితార్థుల నగ్న చీకటికోణాల్లో చిక్కుకున్న అజ్ఞాత శక్తులెందరో...లక్ష్మీకాంతమోహన్లో వుండే వుంటారు. అఖిల భారత స్థాయిన చూస్తే ఆంధ్రప్రదేశ్‌లో ఆనాడు ప్రజానాట్యమండలి ఉద్యమంలో అన్ని జిల్లాలలో పనిచేసిన ప్రజా కళాకురులెందరో వున్నారు. ఇప్పటి దాకా గ్రంథస్తమైన ప్రజా రంగస్థల చరిత్రలో కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల కళాకారుల కృషి రిపోర్టయినంతగా మిగిలిన జిల్లాలది కాలేదనిపిస్తోంది.

ఇ.హెచ్.కార్ అన్నట్లుగా, "వర్తమానం గతంతో చేసే నిరంతర పరిభాషణే చరిత్ర" అనుకుంటే ప్రజానాట్యమండలి చరిత్ర సజీవంగా వుండాలంటే ఆ ఉద్యమంలో పనిచేసిన విజేతల సరసన పరాజితుల చరిత్ర కూడా అనుబంధంగా గుణదోష విశ్లేషణలకి వీలుగా వుండాలి. అలా వుండకపోతే చరిత్ర 'చిన్నచదరైపోయే' ప్రమాదం వుందనిపించింది. యి ప్రత్యేక సంచికను చదవగానే ఆలోచింపచేసే ప్రత్యేక సంచిక తెచ్చిన నిర్వాహకులకు సంపాదకులకు అభినందనలు.

- కాకరాల మదరాము

సి.వి. ఒకడుగే ముందుకు వేయగలిగాడు, సుబ్బారావు పాణిగ్రాహిలా రెండో అడుగు వేయలేకపోయాడు"అని 'సి.వి.పారిస్ కమ్యూన్ కావ్యం' అనే వ్యాసంలో జూన్ 96 ప్రజాసాహితిలో సి.వి.సుబ్బారావు ని పాణిగ్రాహితో పోలిక పెట్టడం ఏ విధంగా సబబు? అదికూడా కేవలం ఒకే ఒక్క వ్యాఖ్యలో....?

**ఏ.రాంచందర్ మెట్పల్లి, కరీంనగర్‌జిల్లా.**

సూర్యతేజ... వివరణ

పాణిగ్రాహి అమరుడై 27సంఃలు గడుస్తోంది. నక్సల్‌బరీ, శ్రీకాకుళం సాయుధ పోరాటాలకు ముందు సాంస్కృతికరంగంలో పాణిగ్రాహి, సాహిత్యరంగంలో సి.వి. ప్రజా ఉద్యమాలకు అత్యంత సన్నిహితంగా ఉండేవారు. పాణిగ్రాహికైతే ప్రజా ఉద్యమానికీ ఆయనకు మధ్యన విభజనరేఖేలేదు. పెనవేసుకొని ఉండేవాడు. ఆయన స్వభావమూ, సాంస్కృతికరంగం యొక్క తీరూ అందుకు దోహదపడ్డాయి. ఆనాడు నెహ్రూ, ఇందిరాగాంధీలపై భ్రమలు, పార్లమెంటరీ సంస్కరణవాద రాజకీయాలు, అంతర్జాతీయం నుండి జాతీయందాకా వ్యాపించిన రివిజనిజం, తెలుగు అభ్యుదయ సాహిత్యం కొడిగట్టి పోతున్న చారిత్రక పరిస్థితుల్లో పాణిగ్రాహి పాటలు ఆటలు ద్వారా వర్గపోరాట తత్వానికి ఎలా ఊపిరిపోశాడో అలాగే తన కవిత్వమూ, వ్యాసాల ద్వారా సి.వి. కూడా అదే కర్తవ్యాన్ని నెరవేర్చాడు. సినిమారంగపుమత్తుని వీడి ప్రజా ఉద్యమాల ఉరవడిలోకి కదలిరమ్మని శ్రీశ్రీని వినియపూర్వకంగా ఆదేశించాడు సి.వి. 1955నాటి ఎన్నికల అనుభవాలతో ఆధునిక ప్రజా స్వామ్యంలో ఎన్నికలు ఎంత బూటకత్వంతో నిండివున్నాయో 1965లో 'విషాద భారతం' కావ్యంలో సి.వి.రాశాడు. గురజాడ, శ్రీశ్రీలపైన సోమసుందర్ అవాకులు, చెవాకులూ పేలితే తన కరకు కలంతో సి.వి. సోమసుందర్ తదితరులపై దండెత్తాడు.

వరంగల్లుజిల్లాలో ఒక కుగ్రామంలో మంచినీళ్లడిగిన ఒక "హరిజను"డికి మూత్రం పోసి తాగించిన సంఘటనపై తరిమెల వాగిరెడ్డి గారు తీవ్ర ఆగ్రహంతో బహిరంగసభలో విరుచుకుపడితే... తెల్లారేసరికి భూస్వాముల కిరాతకత్వం పై కవిత్వంరాసి తనుచేస్తున్న ప్రభుత్వోద్యోగాన్ని కోల్పోవలసిన పరిస్థితులు కొని తెచ్చుకున్నవాడు సి.వి. ఒక్కమాటలో ఒకానొక కాలంలో (1964-70)ప్రజా ఉద్యమాలలో ముందుపీటీన నిత్యం తలమునకలై ఉండే యువజన విద్యార్థి కార్యకర్తలకు అటు పాణిగ్రాహి పాటలూ, ఆటలూ ఇటు సి.వి. కవిత్వము, స్ఫూర్తిని ప్రేరణనిచ్చాయి. అటువంటి కార్యకర్తల నిరంతర వర్గ పోరాట రాజకీయకృషి యొక్క గుణాత్మకమైన మలుపే నక్సల్‌బరీ -శ్రీకాకుళం.

అయితే భారతదేశంలో సాయుధ రైతాంగ పోరాట అనివార్యతను మరొక సారి వెన్నుతట్టి గుర్తుచేసిన నక్సల్‌బరీ తిరుగుబాటు యొక్క సారాన్ని సి.వి. జీర్ణించుకోలేకపోయాడు. పాణిగ్రాహి కలంతోపాటే కత్తికూడా పుచ్చుకుని పోరాట రంగంలో నిలబడి అమరుడైనాడు. సి.వి.ని తుపాకిపుచ్చుకోలేదని అనటం కాదిది. నూతన ప్రజాస్వామిక విప్లవ రాజకీయాల్ని ఒక కవిగా, రచయితగా స్వీకరించి కాలానుగుణంగా ఉద్యమ సాహితీసృజన కొనసాగించలేకపోయాడని మాత్రమే!!

- సూర్యతేజ.

## స్వీకారం

★ మహాత్మా! జిందాబాద్! (నాటిక)
-పోలవరపు కోటేశ్వరరావు, పేజీలు: 30
వెల రూ. తెలిదు.
ప్రచురణలు: సుజాత ప్రచురణలు, 33.16.12 కస్తూరిబాయి పేట,
విజయవాడ - 520010.

★ 'మార్పు' కోసం (కా॥ మార్పు పద్మనాభం తాత శతజయింతి సంస్మరణ సంచిక)
సంపాదకుడు: సన్నశెట్టి రాజశేఖర్
పేజీలు 146 వెలరూ.50.00
ప్రచురణ: మార్పు పద్మనాభం శత జయంతి కమిటీ,
హరిపురం (శ్రీకాకుళం జిల్లా - 532243

★ గన్ని పత్రిక - ఎడిటర్:
గన్ని ప్రతాప్ రవీంద్రనాథ్ (డమ్మి కాపీ)
చిరునామా: గన్ని ప్రచురణలు, పలాస శ్రీకాకుళం జిల్లా.

★ ఒక్కొక్క రాత్రి. హెచ్చార్కె కవిత్వం - 1993-1995
50 పేజీలు. వెల 20/-
ప్రథమ ముద్రణ మార్చి 1996 స్వంత ప్రచురణ
హెచ్చెర్కె జి-7, శ్రీ సాయి అపార్ట్‌మెంట్స్, ఎర్రగడ్డ క్రాస్ రోడ్స్ - హైదరాబాదు -18
సోవ్ డిస్ట్రిబ్యూటర్స్ - విశాలాంధ్ర బుక్ హౌస్, హైదరాబాదు-1

★ పులికూడు-కధల సంపుటి. కె.కె.మీనన్ 148 పేజిలు.
వెల 40/- సోల్ డిస్ట్రిబ్యూటర్స్: నవోదయ బుక్ హౌస్,
కాచిగూడ, హైదరాబాదు-27

★ వలసపోయిన మందహాసం కవితా సంకలనం - వై.ముకుంద రామారావు. 78 పేజీలు
వెల 20/- కాపీలకు విశాలాంధ్ర బుక్ హౌస్ అన్ని బ్రాంచీలలోను.

★ శారదా లోచనం.జనజీవన యధార్థకధా చిత్రాలు., శారదా అశోకవర్ధన్.
దీపికా ప్రచురణలు. హైదరాబాదు
160 పేజీలు. వెల 35/- కాపీలకు : నవోదయ బుక్ హౌస్, ఆర్య సమాజ్ మందిర్ ఎదుట,
కాచిగూడా చౌరస్తా, హైదరాబాద్.

★ రెక్క విప్పిన రెవల్యూషన్ ఏంజెలో కాట్రోచ్చి అనువాదం శ్రీశ్రీ. శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం కూర్పు చలసాని ప్రసాద్. వి.ర.సం. ప్రచురణ 148 పేజీలు వెల 30/- విశాలాంధ్ర ప్రచురణలు- అన్ని బ్రాంచీలలో.

★ సింహగర్జన (నవల) రచయిత లక్ష్మీకాంత మోహన్.
ద్వితీయ ముద్రణ వెల 25/-
ప్రతులకు: ప్రజాశక్తి ప్రచురణలు. విజయవాడ-2





**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | LPSA101M115 |
| పుస్తకం పేరు | ప్రజాసాహితి |
| తారీఖు | 14 March 2025 |
| ముందు అట్ట | No |
| వెనుక అట్ట | No |
| మొత్తం పేజీలు | 64 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | [illegible] |
| పేజీలు విడదీసినది | [illegible] |
| స్కాన్ చేసినది | Naveen |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |